ముప్పది యేడవ పూజా పుష్పము

# శ్రుతిలయలు

## (మధుర గీతాలు)



రచన:

పి. దుర్గారావు, యం. ఓ. యల్.

ప్రథమ ముద్రణము :
400 ప్రతులు


యువనామ సంవత్సరము
శరదృతుము-ఆశ్వయుజ మాసము

1996-అక్టోబరు

వెల : రు. 12-00



ముద్రణ : డి. వి. ప్రింటర్స్,
ఏలూరురోడ్డు, విజయవాడ-2

---

ప్రతులకు :

1. పి. దుర్గారావు, యం.ఓ.యల్.
తెలుగు పండిట్, జిల్లాపరిషదున్నత పాఠశాల,
అడవిదేవులపల్లి, [వయా] మిర్యాలగూడ.

2. నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
సుల్తాన్‌బజార్, హైదరాబాదు.

3. అనిల్ పబ్లిషర్స్, (సరస్వతీ నిలయం)
ట్రంక్‌రోడ్డు, నెల్లూరు.

# వినయ వాక్యము

"శ్రుతిలయలు" అను మధుర భక్తి గీతాల పుస్తకమును ముప్పది యేడవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణారవిందములకు భక్తి పూర్వకముగా సమర్పించుకొనుచున్నాను.

ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొనుచు, అప్పుడప్పుడు భక్తి భావముతో వ్రాసికొనినవి యీ గీతములు. మధుర భక్తితో మనోహరముగా వ్రాసికొనిన మీరాబాయి భక్తిగీతాలు, కీ. శే. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మధుర భక్తి గీతాలు, విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ గారి గీతాంజలి నా యీ భక్తి గీతములకు ప్రేరణయని చెప్పవచ్చును.

శ్రీకృష్ణ పరమాత్మను నాయకునిగా జేసికొని మధుర గోపికగా భక్తితో రచించిన యీ పుస్తకమును శ్రీకృష్ణుని చరణారవిందములకే సమర్పణము గావించుకొనుచున్నాను.

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు మురళీ లోలుడే గాక, పరబ్రహ్మ స్వరూపముగాను, ఇందలి గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు జీవి యొక్క వేదనా పూర్వకమైన ప్రార్థనగాను భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలిత గీతములను పత్రికలు, ప్రముఖులు ప్రశంసించి యున్నారు. వారికి నా యభి

వందనములు. ఇదే విధముగా మఱికొన్ని పుస్తకములు వ్రాయవలెనని నా యాకాంక్ష.

ఈ పుస్తకమునందలి గీతికలు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుది గ్రుచ్చబడినవి. చాలాకాలము క్రిందట వ్రాసుకున్న యీ గీతములు వెలుగు చూచినందు లకు ధన్యుడను. గీతములు చాలావఱకు ఖండగతిలో రచింప బడినవి. విశ్వమంతటా పరమాత్మ నిండియున్నాడనియు, ఆతని మురళీనాదము యొక్క శ్రుతిలయలు వినబడుచున్నా వనియు మధుర భక్తిభావముతో రచింపబడినవి. రస హృదయుల నేమాత్రము స్పందింప జేసినను ధన్యునిగా భావించుకుందును.

—రచయిత

# సమర్పణ

ఎన్ని మారులు పాడినా
వన్నె దరుగదు నీ పాటకు!
ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నెలేమీ తరుగవు గదా!
మఱచి పోవాలన్నా మాధవా!
మఱపురాదు నీ పేరు!
విడిచి పోవాలన్న వీడిపోదు
విడినడని బంధ మిది యేనాటిదో!
తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!
నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!
అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆవేదనతో నా మధుర గీతాలను!
యుగయుగాలనాటి వీ మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయా వేదన!

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నత హిమగిరి శిఖము లొప్పెడు శుభకల్యాణి!
అడుగడుగున పుణ్యభూము లలమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! యీ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటినమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!

# శ్రుతి లయలు
## (లలిత గీతాలు)

తెలి మబ్బులను విరిసె దీరుగా నభమందు
అచ్చరలకును వోలె నటుసంచరించే

కలువ తామరపూలు గొంతులను విలసిల్లె
కమనీయ భావాలు గవులలో దూగాడె

తెలి మబ్బులను విరిసె దీరుగా నభమందు
అచ్చరలకును వోలె నట సంచరించే!

రంగవల్లులు దీర్చె రమణీయ దారకలు
ముత్యాల ముగ్గులను మురిపాన గగనాన
వెండి దీవెలు జార్చె వెస జందమామయును
దీయనీ వెలుగులను దీర్చె జగ మంతటిని!

రెల్లు పూవులు బూచి రెపరెపల నూగుతూ
మన్మధుని బాణాల మాధుర్యమును జూపె
సన్నని గాలులను సఖియ వెన్నెలకాల
మడుగుబెట్టెను భువిని యందాల పాదాల!

బాలభానుని రుచిర బంగారు కిరణాల
కువకువల గువ్వజత గూడు వెడలిన యటుల
ఈ శరత్కాలాన యింపుసొంపులు గాంచి
నాలోని విరహమును నవనీత వికసించె

తెలి మబ్బులను విరిసె దీరుగా నభమందు
అచ్చరలకును వోలె నటు సంచరించే!

## నా భావ గీతిలో

నా భావ గీతిలో నాదమే కాదోయి
మధుర భావాలతో మల్లియలు విరిసేను

మధుర పదములతోని మాణిక్య మాలగా
వేద వనసకువోతె విస్ఫార పరిమళము

నా భావ గీతిలో నాదమే కాదోయి
మధుర భావాలతో మల్లియలు విరిసేను!

మనసు పొరలో నుండి
మమతతో వెలిసినది
గుండె శ్రుతిలయలతో
గూడి వచ్చినదోయి!

గొంతులో రాగముగ
కోకిలకు వలెపాడి
కిన్నెరను జత గలిపి
వన్నెలొలికినదోయి!

ఆకాశ మార్గాన హంసలా పయనించి
శ్రీ మురళి జేరగా
జేర వచ్చినదోయి

నా భావ గీతిలో నాదమే కాదోయి
మధుర భావాలతో మల్లియలు విరిసేను!

# మురళీలోలుని గనుల

మురళీలోలుని గనుల ముద్దుగా జూచితిని
ఏ పూర్వపుణ్యమో! ఏ నోము ఫలమో

చెలియ! నా పాటలో జేర్చి తన మురళినీ
మధురగానము జేసె మాధవుడు స్వయముగా

మురళీలోలుని గనుల ముద్దుగా జూచితిని
ఏ పూర్వపుణ్యమో! ఏ నోము ఫలమో!

ప్రకృతి యణువణువునూ ప్రేమ లొలికించినది
చివురు బూవులతోని చిత్రమాయెను జగతి
సత్య శివ సుందరములు సర్వ జగతిని నిండి
బంగారు గాంతులను బ్రభవించె దశదిశలు!

మమత శాంతీ ప్రేమ మధురమై జగమంత
ఉయ్యాల లూగినది యొయ్యారమొలికించి
విశ్వమంతా విరిసె విమలమగు వెన్నెలలు
సామగానముతోని సర్వదిశలును నిండె!

మురళి నా శిరసునను మోదమున నుంచినటు
శ్రీ మురళిలో నేను జేరినటు లనిపించె
మధుర నిస్వనముగ మాధవుని పాటలో
కలిసిపోయినయటుల ననిపించె కలయందు

మురళీలోలుని గనుల ముద్దుగా జూచితిని
ఏ పూర్వపుణ్యమో! ఏ నోము ఫలమో!

# నా ప్రేమ నీపైని !

నా ప్రేమ నీపైని నాథ! యెంతున్నదో
నీకె తెలియును బాగ నీకె నాకంటె

అందుకే ననుదేర్ప! నలజడుల దొలగింప
జిఋనవ్వు నవ్వింప జేరవచ్చెదవూ

నా ప్రేమ నీపైని నాథ! యెంతున్నదో
నీకె తెలియును బాగ నీకె నాకంటే!

చుక్కాని పడవ నెటు నూటిగొనిపోవునో
నీ మురళి నన్నటుల నిలిచి నడిపించునూ
పాటలో రాగముగ పరవశత గలిగించి
మురళీ రవంబులను ముద్దుగా బాడుదువు!

కొండ మలుపులయందు గోనేరులందునను
ప్రేలందుకొనుమనుచు వేడుకను జేయుదువు
నీ ప్రేమ నా ప్రేమ నిండు పున్నమిలాగు
వంకలేనిది సఖా! వన్నెలే! వన్నెలూ!

సాక్షులెందుకు స్వామి! సరసతను జంద్రుడును
సంజకాంతులవేల? చల్లగాలులవేల
నీకు నేనే సాక్షి! నాకు నీవే సాక్షి
గీటు రాయెందులకు గిరిగీయు టెందులకు?

నా ప్రేమ నీపైని నాథ! యెంతున్నదో
నీకె తెలియును బాగ! నీకె నాకంటే!

## చెట్టు పుట్టలదాటి

చెట్టుపుట్టలదాటి! గట్టు మిట్టలు గడిచి
నట్టడవి కొచ్చితిని! నాథ దర్శింపా

నీ మురళి వినుటకే నీ పాట వినుటకే
కన్నార జూచి నిను కలత మాపుకొనుటకె

చెట్టు పుట్టలదాటి! గట్టు మిట్టలుగడిచి
నట్టడవి కొచ్చితిని! నాథ దర్శింపా!

మూరు మూలలనుండి మమత బెంచెదవేల?
కనుచాటునుండి నను గలతలో ముంపుదువు
అంతరంగము నుండి యాటుపోటులు రేపి
కల్లోల కృష్ణమ్మ కలకలము రేపెదవు!

మురళిపాటను బాడి మోహమున ముంపకని
బ్రతిమాలి బలికితిని! ప్రణయమును రేపకని
మనసులోపలనుండి మాయమగు మనిదెలుప
వినవుగద గోపాల వెంటనుండెద వెపుడు!

గిరిశిఖరముల నుండి క్రిందపడు సోనలా
ఇసుక తిన్నెలపైని బుసకొట్టు యేటిలా
ఆషాఢ మేఘాల నలరేటి మెఱుపులా
పరువెత్తి వచ్చితిని పాదముల బూజింప!

చెట్టు పుట్టలదాటి గట్టు మిట్టలు గడిచి
నట్టడివి కొచ్చితిని! నాథ! దర్శింపా

# కొండ కోనలనుండి

కొండ కోనలనుండి కోవెలకు దూరముగ
నిను పిలుచుచుంటినోయ్! నిఖిలేశ! శ్రీకృష్ణ

ఆర్త్రిమగు నా పిలుపు లన్ని దిశలకు ప్రాకి
మాఱుమ్రోగుచునుండె మధురార్ద్ర భావమున

కొండ కోనలనుండి కోవెలకు దూరముగ
నిను పిలుచుచుంటినోయ్! నిఖిలేశ! శ్రీకృష్ణ!

హా కృష్ణ! మాధవా! యనియేటి పిలుపులే
దిశలన్ని ధ్వనియించు దిక్కులన్నియు కోన
భూమి యాకాశాలు బొపుగా బశుపక్షి
సంతానములు గూడ వింతగా బాడుకొను!

పూల దీవెలపైని పొలుపుగా మూలేటి
తుమ్మెదలు పాడుకొను దూలి నా రాగాలు
అణువణువు ధ్వనియించు అందాల యీ కోన
నా గుండెలో బాధ నా గొంతు రాగాలు!

రాతి గోడలమధ్య రమ్యమగు శిల్పముగ
నిలిచినా నా స్వామి! నీకు వినిపింపదా?
కరుణార్ద్ర భావాన కరము మురళిని దాల్చి
గుడివెడలి రావోయి! కోనలో విహరింప

కొండ కోనలనుండి కోవెలకు దూరముగ
నిను పిలుచు చుంటినోయ్ నిఖిలేశ శ్రీకృష్ణ!

# బృందావనమునందు

బృందావనమునందు అందాల గోపికను
రాసక్రీడలయందు రమ్య నర్తకనీ

రమ్య నర్తనలచే 'రాజహంసి' యనుమ
బిరుదందుకొన్నట్టి చిరదాసి నే ప్రభూ

బృందావనమునందు అందాల గోపికను
రాసక్రీడలయందు రమ్య నర్తకినీ!

రాసక్రీడలయందు రమ్యముగ గొంతెత్తి
పంచమ స్వరమునను పాటుబాడినదాన
నలుగురిలో నేను నవపుష్పమాలతో
బహుమానమందినా భామనోయ్ శ్రీకృష్ణ!

వ్రజభామలందఱీ వలువలెత్తుకపోయి
పొన్న చెట్టెక్కినా పొలుపైన దృశ్యమున
నా వలువ ముట్టకను నను ప్రేమ జూచితివి
ఆనాటి గారవము నలలాయె తెరలాయె!

మంద విడిపోయినా ఘుందాల లేడివలె
విడిపోతి నీ నుండి యడలుచుంటిని వ్యథను
అలనాటి దాసిపయి యలసత్వ మేలనో
మురళిలో నను గలిపి మోదమున దేల్పుమా

బృందావనమునందు అందాల గోపికను
రాసక్రీడలయందు రమ్య నర్తకినీ!

## రాజహంసా! నాదు!

రాజహంసా! నాదు రమణు డెదురయ్యేనా?
నిర్మలాకాశాన నీలిమబ్బుల్లో

నెమలిపింఛముతోని నెమ్మోము విలసిల్లు
కరుణారసము దొలుకు కమనీయ కాంతులను

రాజహంసా! నాదు రమణు డెదురయ్యేనా?
నిర్మలాకాశాన నీలి మబ్బుల్లో!

అరుణారుణ ప్రభల
యందచందాలతో!
బాల సూర్యుని వోలె బంగారు కాంతులే

మురళి నూదుచు నుండు
మోహనా కృతి తోని!
ప్రకృతిని లీనమై పరవశం బగుచుండు

దరిలేని దుఃఖాన
తపియించు దీనులను!
కన్నీరు దుడుచునే కమనీయ హస్తముల

కలువ దామరలున్న
కమనీయ సరసులను
మంచుకొండలలోని మహనీయ శిఖరముల

రాజహంసా నాదు రమణు డెదురాయెనా?
నిర్మలాకాశాన నీలిమబ్బుల్లో!

## నా దీర్ఘ యాత్రలో

నా దీర్ఘ యాత్రలో నా శాంతి పథమందు
తోడెవ్వరును లేరు దోరముగ కృష్ణా!

నా ముందు వెనుకలను నాథ పయనించుచును
కరుణతో, గాపాడ కాంక్షించు చుంటినీ

నా దీర్ఘ యాత్రలో నా శాంతి పథమందు
తోడెవ్వరును లేరు దోరముగ కృష్ణా!

కొండ కోనలలోని కోకిలగ జతగూడి
కలిసి పయనింపగా గాంక్షించితిని గాద
ఆడుతూపాడుతూ యందాల నీ గుడిని
యందు కొనుటకు గాద యలరితిని శ్రీకృష్ణ!

కనిపించినను సరే కనిపింపకున్ననూ
వెంటనుండుము స్వామి విమల వాత్సల్యమున
మైదానములయందు మరు భూములందునూ
మంచిస్నేహితునిగా మసలుమూ నాతోని!

చల్లనీ నీడలను చల్లనీ గాలులను
కాంతిరేకలు విరియు కమనీయ మార్గముల
నే బోవు దారులను నీవు గర్పించాలి
సహ యాత్రికుడవుగదా చక్కనీ శ్రీకృష్ణ

నా దీర్ఘ యాత్రలో నా శాంతి పథమందు
తోడెవ్వరును లేరు దోరముగ కృష్ణా!

# బంగారు పల్లకిని

బంగారు బల్లికిని బంపెనే నా విభుడు
నేబోవుచున్నాను నిను విడిచి చెలియా

కన్నీరు నింపకుము గధల నన్ని దలచి
చిననాటి స్నేహమును జిత్రించుకొని యెదుట

బంగారు బల్లకిని బంపెనే నా విభుడు
నే బోవుచున్నాను నినువిడిచి చెలియా!

ఆడి పాడిన స్మృతుల నందాల బొమ్మలకు
పెండ్లిండ్లు జేసినా ప్రీతి కథలన్నిటిని
మనసులో నుంచుకొని మదిదలచుకొని నన్ను
కన్నీరు నొంపకుము! గలతనలతల మునిగి!

పెంచినా పూలతల బ్రేమతో జూడుమా
అలమావిగున్నలను నరయుమా! దయతోని
ప్రేమతో బెంచినా ప్రియమైన లేడినీ
కన్న కూతురు వోలె గాంచవే ప్రియసఖి!

హంసరాజిలుకలను నరయుమా దయతోని
గోరింకతో బలుకు గుమిలిరోదింపకుము
సతులసౌభాగ్యంబు బతులతోనే గదా
పోవుచుంటిని చెలి! పొలుపుగా బతి గృహము!

బంగారు పల్లికిని బంపెనే నా విభుడు
నే బోవుచున్నాను నిను విడిచి చెలియా!

# పిలువకున్నా నన్ను !

పిలువకున్నా నన్ను బిలిచేవు శ్రీ మురళీ !
దలపకున్నా నన్ను దలచేవు కృష్ణా !

ఎచట నున్నా నన్ను వెదకి వెదకి చూచి
యిమ్ముగా ప్రేమలను గ్రుమ్మరించెదు స్వామి !

పిలువకున్నా నన్ను బిలిచేవు శ్రీ మురళీ
దలపకున్నా నన్ను దలచేవు కృష్ణా !

కలత నలతల నున్న కన్నీరు నొలికినా !
అలసి సొలసిసగాని యాటాటబడినను !
నీవె దిగులొందెదవు ! నిలువునా నీరవుదు !
కన్నతల్లికి వోలె గనికరము జూపెదవు !

దీర్ఘయాత్రను నేను దిగులొందినపుడును !
గమ్యమును మఱచి నే గలగుండు బడునపుడు !
కాంతిరేఖను నేను గనజాల నపుడును
ధ్రువతారగా నాకు దోడుగా నుండెదవు !

నాగాఢ ప్రేమకయి నలుగు చుండెద వెప్డు
ప్రేమార్ద్ర భావమును ప్రీతిగోరుద వెపుడు !
పెదవిపై చిఱునగవు సదయ ! గోరుదు వెపుడు
గొంతెత్తి నే బాడ గోరుచుందుదు వెపుడు !

పిలువకున్నా నన్ను బిలిచేవు శ్రీ మురళీ !
దలపకున్నా నన్ను దలచేవు కృష్ణా !

# కొండ కోనల్లోని !

కొండ కోనల్లోని కోకిలా ఒకమాట !
నీ పాటతో గలిపి నా పాట పాడనీ !

ఇరువురము పాడేది విరహ గీతముగదా!
గొంతెత్తి పాడుదము కోన ప్రతిధ్వనియింప !

కొండకోనల్లోని కోకిలా ఒకమాట
నీపాటతో గలిపి నా పాట పాడనీ !

ముగ్ధ మోహనుడైన ముద్దుగోపాలుకయి
విలపించుచున్నావు నెలమావి తోటలో !
చిక్కని భావాలు జిందేటి గీతితో
పిలుచుచున్నాను నే ప్రీతిగోపాలునీ !

వనమునను గవలాడి మాయజేసెను మనల
మురళి వినిపించుచును మూర్ఛనలు గలిగించె !
అవలు మండిపి మనము నాకాశమెత్తుగా !
వినిపించుకోడుగద వేణునాదము నాపి !

చిక్కటి తాలుపలు గడలి చేరిన గూడ
ఉండి పిలిచేటి మన యార్తనాదము వినడు !
ఎప్పుడు దయగలుగునో యింపొంద మనమీద
చిక్కడు నే మరిచి గారవించునో గదా !

కొండకోనల్లోని కోకిలా ! ఒకమాట !
నీ పాటతో గలిపి నా పాట పాడనీ !

## మనసులో గనిపించి

మనసులో గనిపించి మాధుర్యమును జూపు !
తీయనీ యందాల తేనె లొలికించూ !

ఎదుట నిలిచీ నాదు నెద యార్తి బాపడే
కలుపుకోడే చెలీ ! కమనీయ జ్యోతిలో !

మనసులో గనిపించి మాధుర్యమును జూపు !
తీయనీ యందాల తేనె లొలికించూ !

అద్దంలో నే జూడ నగుపించు మురళితో
చేరదీయగ జాచు జేతులను నా వైపు !
నే కరములను జాప నిర్దయను బ్రకటించు
తెల్లనీ యద్దమే తేరిజూచును నన్ను !

కనులలోపలనుండి కలతనలతల జేయు
భావమున నిలిచి నా బ్రతుకు నుప్పెన జేయు !
అడుగడుగునా యతని యందాలు దలచుకొని
ఐవితేచు చుందునే బ్రదుకుభారము గాగ !

ఎదుటి కెందుకు రాడు? ఏనాటి వైరమో !
చిత్రవధలను జేయు జిత్రించి బొమ్మగా !
చైతన్య రేఖగా జేరరానీయడూ !
దరిజేర దరిజేర దూరదూరంబగును !

మనసులో గనిపించి మాధుర్యమును జూపు !
తీయనీ యందాల తేనెలొలికించూ !

# శ్రుతిలయలు దప్పినవి !

శ్రుతిలయలు దప్పినవి ! చోద్యముగ బ్రతుకులో !
మతి భ్రమను జెందినది మాయముగ కృష్ణా !

లయతాళములు దప్పె లావిత్యమును మాసె
గీతిలో భావాల రీతి మార్గము దప్పె !

శ్రుతిలయలు దప్పినవి ! చోద్యముగ బ్రతుకులో
మతి భ్రమను జెందినది మాయముగ కృష్ణా !

హంసగమనమువోలె నలరేటి జీవితము !
పాలపిట్టకు వోలె బడిలేచుచుంటినీ !
కోకిలకు సాటియగు గొమరొప్ప నాగొంతు !
పికిలిపిట్టకు మల్లె వికలమయి పోయినది !

వనమయూరము వోలె వయ్యారమొలికించు
మధురనృత్యములోని మాధుర్యములు బోయె !
పంజరములో జిలుక పలికేటి పలుకులో
స్వరభేదమును గలిగె సరసతలు నశియించె !

నీ విరహవేదనను నిటులైతి శ్రీ కృష్ణ !
పొగమంచులో మనసు బొగులుచున్నది స్వామి !
శ్రుతిలయలు దప్పి యీగతి మార్గములు లేని
యీ వీణ బ్రోగించి ! యెటు పాడగలనోయి

శ్రుతిలయలు దప్పినవి ! చోద్యముగ బ్రతుకులో
మతిభ్రమను జెందినది ! మాయముగ కృష్ణా !

# నా పాట పాపగా

నాపాట పాపగా నామనసు నాడుకుని
అందాలు జిందుతూ యాటలాడేది !

తెక్కలొచ్చెను నేడు రెక్కవతె గగనాన
అందాలరాగాల నంతటా దిరుగునూ !

నాపాట పాపగా నా మనసునాధుకుని
అందాలు జిందుతూ యాటలాడేది !

చిటిపొట్టి పాటలను జిన్నారి నడకలను
పచ్చిరానీ పాట వరుస బాడేటి !
ఆనాటి పాటలే ! ఆనాటి నడకలే
యాలపించుచునుండె యంతరిక్షమునందు !

నినుజూడ వేడుకను నీ మురళి కలయికను
వాంఛించుచున్నదీ వన్నెలాగోపాల !
నీ మురళిగానమున నినదించి తనపాట
అణగిపోవాలన్న యాశతో గోపాల !

తారలను చంద్రునీ తగ సంధ్యకాంతులను
వనవీధిలోనున్న వాసంతిదివెలను !
తియ్యమామిడి నడుగు దీరుగా కోనలను
కూయంచు బాడేటి కోకిలను నీ జూడ !

నా పాట పాపగా నా మనసు నాధుకుని
అందాలు జిందుతూ యాటలాడేది !

# సంధ్యకాంతుల్లార !

సంధ్యకాంతుల్లార ! సరసగోపిక నేను !
ముద్దు గోపాలునీ మురిపెముగ జూచిరా?

ప్రేమలో నను ముంచి ప్రీతి ముద్రిక నిచ్చి
మఱుమాయేమాయెనూ ! మఱియెందు గనరాడు !

సంధ్యకాంతుల్లార ! సరసగోపిక నేను
ముద్దుగోపాలునీ మురిపెముగ జూచిరా?

ఆటలో ననుముంచి పాటలో నను దేల్చి
అందాలసీమలో యప్సరసనని బొగిడి !
రాసకేళీనాటి రమణినని కీర్తించి
మనసు దోచెను చెలులు ! మధురిమలు జూపించి !

తాళి గట్టెను నాదు పగ కంఠసీమలో
మూడుముడులును వేసి మురిపాలు జిందెనే !
బాసలెన్నో జేసె పదిమంది జూడగా !
చంద్రసూర్యులు సాక్షి ! ఇంద్రధనుసును సాక్షి !

మేఘమాలికలలో మెఱుపు దీగెలయందు
దాగియున్నాడేమొ దయజేసి దెలుపుడో !
కాంతిపుంజములార ! కరుణారసములార !
పసుపు కుంకుమలతో బన్నుగా బూజింతు !

సంధ్య కాంతుల్లార ! సరసగోపిక నేను !
ముద్దు గోపాలునీ ! మురిపెముగ జూచిరా?

# ఏ పగలు వత్తువో !

ఏ పగలు వత్తువో ! యే రాత్రి వత్తువో !
ఏ సంజ వెలుగులో ! యే మసకలందో !

నను బ్రోవ వత్తువని నాధ ! నే కనుదెఱచి
యెదురుచూచుచు నుందు మదిహెంగుతెత్తగా

ఏ పగలు వత్తువో ! ఏ రాత్రి వత్తువో !
ఏ సంజవెలుగులో ! ఏ మసకలందో !

అపురూప భావాల ఆనందరాగాల
మధురపదములతోని మాధుర్య మొలుకగా !
గొంతు సరిజేసికొని కోరకను బూరించి
వేచియుంటినిస్వామి ! వినిపింప నా పాట !

వన్నెలా ధ్వనులతో గిన్నెరను బలికింప
సరిజేసి తంత్రులను సరస నుంచితి నోయి !
నీరాక కౌఱకునయి నిలిచి యుంటిని స్వామి !
నీలి గగనము వంక నిరతమును జూచుచును !

అన్నపానీయాలు గన్నార నిద్రయును
వర్జించితిని స్వామి ! వత్తునని యాశతో !
పులకరించిన గాలి, పూదీవె గదిలినా
నీరాకయని మదిని నిలిచి జూతును కృష్ణ !

ఏపవలు వతువో ! ఏ రాత్రి వత్తువో !
ఏ సంజ వెలుగులో ! ఏ మస్తకలందో !

# ఎంత వలపున్నదో!

ఎంతవలపున్నదో ! ఎంతగా మనసుందో !
నాథ! నీ వుంతవూ! నా గీతి వినకా !

నా గుండెలో పాట నవనీత ! వినవుంత
ఒక నిముషమయినను ఓర్వజాలవుగా !

ఎంత వలపున్నదో! ఎంతగా మనసుందో !
నాథ! నీవుంతవూ! నా గీతివినకా!

సప్తస్వరములయందు సంగీతధ్వనులతో
నీ మురళి వినిపించు నిరతమును మదియందు !
ఆనంద వాహినిని యటుదేల్చుచుందువూ !
ఏమకో యీ వలపు ! అంతులేని ప్రేమ !

నా గుండెలో పాట నాథ ! ఒక నిముసమును
ఆగి యుండదుగదా ! యపురూప చోద్యమగు !
కనిపింపకున్ననూ కనిపించి నటులుగా
భ్రమజెందు చుందునూ పల్లవిని బాడుతూ !

విడిచియుండని ప్రేమ విడివడని మనవలపు
కలిసియుండిన రీతి కనిపించు నొకసారి !
కంటికగుపింపకను కలతనలతలబొంది
మూరానయున్నటుల దూరపిల్లుచుందునూ !

ఎంత వలపున్నదో ! ఎంతగా మనసుందో!
నాథ నీవుంతవూ ! నా గీతి వినకా !

# మబ్బులో అందాలు

మబ్బులో అందాలు మదినిలుపుకోలేను
మాధవా ! నీ మీద మరులాప లేనూ !

మనసు విప్పారు నవ మాలతీలతవోలె
వికసించు కమలముగ వేయిరేకలతోని !

మబ్బులో అందాలు మది నిలుపుకోలేను !
మాధవా ! నీ మీది మరులాపలేనూ !

ప్రకృతి యందాలన్ని పారవశ్యము జెంది
మబ్బులను జేరినా మాధుర్య మనిపించు !
మెఱుపు దీవెలతోని మేలిమాడుచు భువిని
వర్షధారల దడిపి వగదీర్పు ననిపించు !

చద్దియన్నము మూట చంకలో ప్రేలాడ
మురళి చేతనుదాల్చి మోదమును వికసింప !
నెమిలిపింఛముతోని నేర్పుతో నటియించు
మాధవా! నినుజూడ మది భాగ్యమనిపించు !

మేఘమాలను జూడ మిలమిలల నొందు మది
అల్లరి నిను జూడగా నల నౌదు తెర నౌదు !
మబ్బులను నేజూతు ! మాధవా ! నినుగూడ
కోటియందాలుగల కొదురొప్ప నీరూపు !

మబ్బులో అందాలు మదినిలుపు కోలేను !
మాధవా ! నీ మీది మరులాపలేనూ !

# మఱి గోర నెవ్వరిని

మఱి గోరనెవ్వరిని మాధవా! నిను దప్ప
అంతరంగమునందు నలరు వేడుకలో

నే జోవు వనగిరుల నే నరుగు నదవులను
జతగ నీవుండగా వ్రతము బట్టితిగాద!

మఱి గోరనెవ్వరిని మాధవా! నిను దప్ప
అంతరంగమునందు నలరు వేడుకలో!

నే వేయు భూమికను నీతోని రంగమున
జతగ నటియింతుగా జగదీశ! శ్రుతిలయల
ఆటపాటలతోని అందాల నాయికగ
నటియింతు నీతోని నటియింప నోరులతో

ప్రకృతి యందాలలో బడితేచు వనగిరుల
నింగి నీలాకాశ నీడలను బయనింప
నావెంట జనుదేర! నను బ్రేమదేలింప
నిను గోరుదును స్వామి! నిర్మలంబగు ప్రేమ

వరియించితిని నిన్ను వన్నెలాడా! పతిగ
భవ బంధముల నూర్చి బ్రతుకు తెలవారగా
నీ మురళితో దప్ప నిఖిలాత్మ! యొరులతో
పాట బాడనుగదా! పల్లవిని జతజేసి

మఱి గోరనెవ్వరిని! మాధవా! నినుదప్ప
అంతరంగమునందు నలరు వేడుకలో!

## నను విడిచి పోబోకు!

నను విడిచి పోబోకు! నాథ! శ్రీ గోపాల
నీవు లేనిది క్షణము నిలువలేనోయీ

బ్రతుకు బాటను నాకు పాటవూ! మాటవూ
అడుగడుగునందునను నాడుకొను వాడవూ

నను విడిచి పోబోకు! నాథ! శ్రీ గోపాల
నీవు లేనిది క్షణము నిలువలేనోయీ

ఎన్నితిని సఖునిగా విన్నపము చేసితిని
అన్ని నీవనుచు నే నాత్మలో నమ్మితిని
తియ్యనీ పాటతో దీరుగా నినుగొలిచి
చయ్యనా నినుజేర సఖియగా మారితిని

అందాల మురళిలో నతికి పోవుటకునయి
ఎన్నెన్నొ యందాల వన్నెలొలికితిని?
అలనాటి గోపికగ యవతార మెత్తితిని
రాసక్రీడలనాటి రమ్యనర్తకినైతి

పాలు నీరూ కలిసి ప్రవహించినట్లుగా
కలిపోతిని నీలో! కమ్మనీ నీరముగ
వేఱుజేయుదువెటుల? విడిపోవుటెటులు యిక?
కాంతిలో కిరణముగ కలిసిపోనిమ్మా

నను విడిచి పోపోకు! నాథ! శ్రీగోపాల
నీవులేనిది క్షణము నిలువలేనోయీ!

## నను పిలిచెనోయమ్మ!

నను పిలిచెనోయమ్మ! నా ముద్దు కృష్ణుడూ
మురళి వినిపించగా మోహములు జిందా

పచ్చని రాచిలుక, పసిడి గోరింకతో
రమ్మని కబురంపె రమణు డీ రాత్రినీ

నను పిలిచెనోయమ్మ! నా ముద్దు కృష్ణుడూ
మురళి వినిపించగా మోహములు జిందా

మలిసంజ తెంపులను మసక చీకటులందు
తలిరాకు కొనకొనల తేలియాడే వేళ
పలువన్నెపూవులు విరియు కమనీయ సమయాన
రమ్మని కబురంపె రయముగా వనవీధి!

ఎన్ని జన్మలనుండి ఎన్నపము జేసితిని
ఎన్ని వ్రతములు జేసి కరుణ వేడితినమ్మ
ఇన్నాళ్ళకి నేడు వలపు నాపై గలిగి
మురళి వినిపించగా ముద్దు ముచ్చట గలిగె

కిన్నెరను చేకొందు! కీర్తనలు పాడగా
కాలిగజ్జెలు మెండు కమనీయ నర్తనకు
అడుగడుగున ఆడుదును అందాల గోపికగ
ముద్దు కృష్ణుడు మురళి మోదమున పాడగా

నను పిలిచెనోయమ్మ! నా ముద్దు కృష్ణుడూ
మురళి వినిపించగా మోహములు జిందా!

# తీయని నీ ప్రేమ

తీయని నీ ప్రేమ తీరుగా వర్షించి
నా మదిని నిలవాలి నందగోపాలా
మఱచిపోయినగాని మఱచిపోకుండునటు
వెలుగు దీపికలతో వికసింపజేయాలి
తీయని నీ ప్రేమ తీరుగా వర్షించి
నా మదిని నిలవాలి నందగోపాలా

కలతతో నలతతో
కల్లోల సమయాల
దారి జూపింపాలి
దయగలిగి నా మీద
వేగు చుక్కకుమల్లె విమల సంధ్యలకు వలె

మధురమగు నీ పేరు
మనసునందుండునటు
మంగళంబగు రూపు
మది నిలిచి యుండునటు
మఱచిపోకుండునటు మధురమౌ నీగీతి

విశ్వమానవప్రేమ వెల్లి విరిసేటట్లు
విమల సౌందర్యములు వికసించునటు హృదిని
నీ మురళిపాటలో నాపాట కలియునటు
నదులలో గిరులలో నాదమయి మ్రోగునటు
తీయనీ నీ ప్రేమ తీరుగా వర్షించి
నా మదిని నిలవాలి! నందగోపాలా!

# దరికి రానీయడే !

దరికి రానీయడే దరిజేర దా జరుగు
మురళి నంటగనీడు మోదమున జెలియా

తనమురళితో గలిపి తగ బాడనీయడే
వేఱువేఱని జెప్పి వ్యధగలుగజేయునే

దరికిరానీయడే దరిజేర దా జరుగు
మురళి నంటగనీడు మోదమున జెలియా

ఆత్మార్పణంబనుచు నంజలిని ఘటియింప
కరుణారసము బొంగ గాంచునే మోదమున
ప్రేమతో దరిజేర్చి ప్రీతి జిందడె సఖి
కర్మబంధములన్ని కడకు బోవలెనంటు

విశ్వమోహనమైన విమలమగు మురళినీ
ఒకసారి మ్రోయింప నొసగ వేడితినంతె
మనసార నాకోర్కె మన్నింపడే చెలీ
కన్నీరు వరదలయి కడలిజేరాలంటు

కర్మబంధములన్ని కడకుబోయేదెపుడు?
కన్నీరు వరదలయి కడలి జేరేదెపుడు?
కాంక్షలవి లేకుండ కటికి చీకటి గడిచి
విమలకాంతులయందు విరియు టది యెన్నడో

దరికిరానీయడే ! దరిజేర దా జరుగు
మురళినంటగనీడు మోదమున జెలియా

# మనసార స్మరియింపు !

మనసార స్మరియింపు మాధవుని యొకసారి
కర్మబంధములన్ని కడదేర మనసా

కొండలో కోనలో కోకిలకువలె బాడి
గిరిసోన ధ్వనులతో కీర్తనను బాడుమా

మనసార స్మరియింపు మాధవుని యొకసారి
కర్మబంధములన్ని కడదేర మనసా

వేచుక్కతో వచ్చు వేయికుంకుమలతో
మనసు దొలికింపుమా ! మాధవుని దలపా
మనసులగ్నముజేసి మధురగీతము నొకటి
గొంతెత్తి బాడుమా ! కోటియందాలతో

ఒక్కొక్క పదముతో చక్కనీ మాలగా
చిక్కనీ భావాలు జిందింపు గీతిలో
ఎక్కడున్ననుగాని యిక్కడున్నటులుగా
భక్తితో వినుతింపు రక్తితో గోపాలు

మధురమౌ పదములను మనసు పులకించాలి
చేర్చినా భావాలు శ్రీ విభవ మొందాలి
గొంతులో రాగాలకొసలు బూదీవెలను
యల్లుకొని పరిమళము నంతటా విరియాలి

మనసార స్మరియింపు మాధవుని యొకసారి
కర్మబంధములన్ని గడదేర మనసా

## నా పూలతోటలో

నా పూలతోటలో నాథ ! పూచిన పూలు
నీ కోసమే నోయి ! నీ కోసమే

మనసులో విరిసినా మధురగీతాలన్ని
నీ కోసమే కృష్ణ ! నీ కోసమే

నా పూలతోటలో నాథ పూచిన పూలు
నీ కోసమే నోయి ! నీ కోసమే

తీయనీ తెలుగులో తీపి పదములతోని
మాలగా గ్రుచ్చితిని మదికింపు పెంపగా
హారమును ధరియించి యందాలు జిందగా
గంతులేతు వటుంచు గద స్వామి ! గూర్చినది

చిని చిన్ని పూలివి ! చిత్రమగు పూలివి
రంగు రంగులపూలు ! రమణీయమైనవి
రాగాలు దీసేటి రమ్యమగు పూవులివి
వాడిపోవెన్నడును ! విడిపోవు నిన్నెపుడు

ప్రతిపూవునకు నేను పాఠాలు జెప్పితిని
తీయనీ నా ప్రేమ దీపులను నేర్పితిని
హరిని విడువకు మనుచు నాజ్ఞలను జేసితిని
ఎటుబోదువింత నా చిటిపాపలను విడిచి

నా పూలతోటలో నాథ పూచినపూలు
నీ కోసమేనోయి ! నీ కోసమే

# నా మనసు దూరముగ

నా మనసు దూరముగ నాథ ! పోబోకుమా
నా ప్రేమ బంధమును నాథ విడకోయీ

కలిసియుందుము కృష్ణ ! కమ్మని మురళితో
మధుర నాట్యముతోని మాధుర్య మొలుకుచూ

నా మనసు దూరముగ నాథ ! బోబోకుమా
నా ప్రేమ బంధమును నాథ ! విడకోయీ

మనసు శూన్యము జేసి మాధుర్యమును మాపి
కలత గలిగించి మది కదిలిపోబోకోయి
నిను బాసి నిముసమును నిలువజాలను కృష్ణ!
బ్రతుకంత నీమోదె ! భారమంతా నీదె

రమ్యగీతికలోని రాగమును నాపకుము
బంగారు కిన్నెరను బ్రతిధ్వనుల నాపకుము
మదిపొంగు భావాల మధురిమల దోలగించి
ప్రేమముడి విడదీసి ప్రీతి నాపకు కృష్ణ

ఊరియలను బసిపాప యూగేటి చందాన
తాజిలుక మావిపై రాజిల్లు చందాన
గగనాన చందురుడు కాంతి చిందినయటుల
నా మనసులో నుండు నాథ ! యెల్లపుడునూ

నా మనసు దూరముగ నవనీత ! పోబోకు
నా ప్రేమ బంధమును నాథ ! విడకోయీ

## ఆనంద సత్యాల

ఆనంద సత్యాల అందాల మూర్తిగా
నిను నిలిపితిని యెదను నిండుగా కృష్ణా!

మధుర పదములతోని మాలగా గీతమును
పాడుకొనుచున్నాను పరవశము జెందగా

ఆనంద సత్యాల అందాల మూర్తిగా
నిను నిలిపితిని యెదను నిండుగా కృష్ణా

ఏ లోకముల లేని యింపయిన నీ రూపు
రంగు రంగుల యందు రమణీయ మూర్తిగా
నా మనసులో నున్న నాథ! నీ చిత్రమును
పద్మ పత్రముపైని పన్నుగా వ్రాసితిని

కవిలోని భావాల కావ్యగీతికవోలె
అందాల శిల్పమై యతికినది హృదయాన
శిల్పినయి మనసులో జేత నులి ధరియించి
అందాలమూర్తిగా నణువణువు జెక్కితిని

లలిత కళలను నేర్చి లాలిత్య మొలుకగా
గూర్చితిని స్వామి నీ కోవెలను యెదయందు
నా చిత్రకళ శిల్ప నాట్య కవితల జూచి
నను నీలో కలుపుకొను నాథ ! నా వినతి యిదె

ఆనంద సత్యాల అందాల మూర్తిగా
నిను నిలిపితిని యెదను నిండుగా కృష్ణా!

## కవితలో గలిసిపో !

కవితలో గలిసిపో ! కమనీయముగ కృష్ణ
పాటలో నిలిచిపో ! పరవశము జెందా!

నాతోని బాడించి నవ్య గీతము లెపుడు
నాట్యమాడాలి సుమ ! నవమోహనా కృతిని

కవితలో గలిసిపో ! కమనీయముగ కృష్ణ
పాటలో నిలిచిపో ! పరవశము జెందా

సరిక్రొత్త భావాలు ! సరిక్రొత్త రాగాలు
సంజకాంతులవోలె సరసత్వ మొలకాలి
తుమ్మెదలు బాడినటు దూలుతూ రాగాలు
దూరాన కోకిలలు మారాము జేసినటు

మేఘ మాలికచాటు మెఱుపు మెరిసినయటుల
వెన్నెలలు విరిసినటు వేడుకను హరివిల్లు
ఆకాశ మంతటను నావరించిన రీతి
మధురభావాలు నా మదియందు విరియాలి

ఒక్కొక్క పదమిమ్ము వొయ్యారముగ నేను
పాటగా గూర్చెదను బరిమళము జెందగా
ఒక్కొక్క చిఱుగజ్జె యొనర యందింపుమా
నాట్య మాడుదు కృష్ణ ! నవనాట్య భంగిమల

కవితలో గలిసిపో ! కమనీయముగ కృష్ణ
పాటలో నిలిచిపో ! పరవశము జెందా

# కనిపింప వెందుకో !

కనిపింప వెందుకో ! కల్లకపటము లేక
మధురమౌ నీ సొగసు మనసునను జూపి?

విని పింతు వెందుకో ! వేణువును దూరముగ
కలిసి నా గీతితో కరిగి జతగూడవూ?

కనిపింప వెందుకో ! కల్లకపటములేక
మధురమౌ నీ సొగసు మనసునను జూపి

మెల్ల మెల్లగ పూల మల్లెలా పొదలందు
దాగి యుండెదవేల ? దరికి రా వెందుకని ?
అందాల నీ మోము నలరి జూపక యిటుల
కన్నీళ్ళ ననుముంచి కలత బఱచుట తగున ?

నీలిమేఘాలలో నీడగా గనిపించి
మాయమయ్యెదవేల ? మధురిమల జిందుచూ
చుక్కలన్నీ వెదుక సుందరంబగు మోము
నక్కియున్నా చోటు ! నాథ! నే గనుగొనను

నా వెనుక నడచెదవు ! నాథ నా నీడగా
కలగాదు నిజమనుచు గాంతు నే వెనుదిరిగి
అపుడె దాచెదవు నీ యందాల నగుమోము
అణువణువు సుందరం బలరేటి ప్రకృతిని

కనిపింప వెందుకో ! కల్లకపటములేక
మధురమౌ నీ సొగసు మనసునను జూపి

# నిను బాడి నిను యాడి

నినుబాడి నిను యాడి నీరసించెను మనసు
మంచుగా మారినది మాధవా ! వలపూ

ఆడి పాడగలేను అందాల గోపికగ
మదియందు యేమేమొ మసక జీకటులాయె

నినుబాడి నినుయాడి నీరసించెను మనసు
మంచుగా మారినది మాధవా ! వలపూ

నా తోని జత కలిపి నవ్య గీతము బాడు
కోకిలదె ! పాడనని కోనలకు బోయినది
రమ్య కవితను బలుకు రాజిబుక మౌనముగ
పయనమయి పోయినది ! బహుదూర భూములకు

ఆకురాలుచు నుండె అందాల వనసీమ
మంచు ముత్యాలతో మహినిండె యణువణువు
దూరాన వనరేఖ దురపిల్లుచున్నటుల
తెల్లనీ ముసుగులో దేలియాడుచు నుండె

నా మదికి నవనీత ! నవ్యతలు మాసినవి
పసిడి నిగ్గులు జారి పలవరించుచు నుంటి
క్రొత్త గీతముబాడ గోరికయు నశియించె
చలి చల్లదనముతో దపసిగా మారినది

నినుబాడి నిను మాడి నీరసించెను మనసు
మంచుగా మారినది మాధవా ! వలపూ

# అందాల నీ మురళి

అందాల నీ మురళి యణువణువు పులకించు
తీయని లోకాల దేలుదును కృష్ణా!

వేయి దీపాలలో విహరించినటులుండు
కాంతి కిరణాలలో కలిసినటులనిపించు

అందాల నీ మురళి యణువణువు పులకించు
తీయని లోకాల దేలుదును కృష్ణా !

సంధ్యా కాంతులయందు సాహిత్య గీతికల
ఉయ్యాల లూగినటు నూహలే చెలరేగు
కమ్మని స్వప్నాలను బొమ్మగా మారి నే
నాట్యమాడిన యటుల నా మనసు కనిపించు

అలల తరగంలోని యందాల జిందుచూ
సెలయేటి వాగులా పులకించు నా యెడద
[illegible] ధ్వనులు పలికేటి శిలవోలె
నా మనసులో మ్రోగు నవగీతి శ్రుతిలయలు

ఆషాఢ మేఘాలు అరుదెంచినటులుండు
మెరుపు తీగెలు మింట మెరిసినటు లనిపించు
హంసలా గగనాన యెగిరి విహరించినటు
మాధవా! నీ మురళి మహిమగద యిదియంత

అందాల నీ మురళి యణువణువు పులకించు
తీయని లోకాల దేలుదును కృష్ణా!

## ఈ ప్రేమ లెందుకో!

ఈ ప్రేమ లెందుకో ! యీ వలపు లెందుకో
చిన్ని కృష్ణుని మురళి సింగారములపై

బాలకృష్ణుని జూడ పరుగు లెత్తును మనసు
మురళిపాటను వినగ మోరలెత్తుచు నుండు

ఈ ప్రేమ లెందుకో ! యీ వలపు లెందుకో
చిన్ని కృష్ణుని మురళి సింగారములపై

పాల వెన్నెలలోని బంగారు కాంతులను
తనలోను దాచుకుని తన్మయం బగునటుల
పాడుకొను సెలయేటి పాటగా మురళితో
కలిసి పాడగ మనసు గలవరించుచు నుండు

పూలతలు దరులతో పెనవేసికొని నటుల
నా మనసు గీతితో నాట్యాలు సలుపుచూ
తియ్యనీ మురళిలో వొయ్యార మొలికించి
కలిసిపోవాలనుచు కలకలా ధ్వనియించు

వినువీధి మెఱుపులా వీచేటి గాలిలా
కడలిలో కదిలేటి బడబాగ్ని రీతిగా
ఆ మురళి లోలునీ యందాల మురళినీ
కలిసిపోవాలన్న గాఢమైనా కాంక్ష

ఈ ప్రేమ లెందుకో ! యీ వలపు లెందుకో
చిన్ని కృష్ణుని మురళి సింగారములపై

## నీ మురళీ ధ్వనులతో

నీ మురళీ ధ్వనులతో నే విసిగి పోతినీ
ఆపవోయీ కృష్ణ ! అందాల మురళీ

దిక్కులను వెదికితిని ! దిశలన్ని వెదికితిని
కనిపింప వెందుకని కమనీయ రూపాన

నీ మురళీ ధ్వనులతో నే విసిగిపోతినీ
ఆపవోయీ కృష్ణ ! అందాల మురళీ

కొండ కోనలయందు గోకిలలు పాడినటు
నీ మురళీ నే విందు నీటుగా శ్రీకృష్ణ
పరువెత్తి నేబోయి పరగ జూతును గదా
పొలపిట్టను జూతు పరువెత్తు వాగుపై

ఒయ్యారముగ మురళి వనవీధి ధ్వనియించి
నను బిలుచు టెందుకో ! నాథ! శ్రీ గోపాల
మల్లెమాలతి పొదల మాధవా ! నినువెదుక
తుమ్మెదలు కనిపించు తూలుతూ నాట్యముల

అర్ధరాత్రిని గూడ అందాల మురళితో
నను బిలిచినటులుండు నవనీత ! చిత్రమిది
స్వప్నమున నే జూతు ! సుడివడిన మనసుతో
నిర్మలా కాశమును ! నిలిచినా తారలను

నీ మురళీ ధ్వనులతో నే విసిగి పోతినీ
ఆపవోయీ కృష్ణ అందాల మురళీ

# ఎంత వాడాయెనే!

ఎంత వాడాయెనే ! వింతగా కృష్ణుడూ
చంటి తనములు మాసె సఖుడాయె గోపికల

రాస క్రీడలు సలుపు రమణుతో నే నెటుల
మోమెత్తి జూతునే మురిపాలు జిందుచూ

ఎంత వాడాయెనే వింతగా కృష్ణుడూ
చంటి తనములు మాసె సఖుడాయె గోపికల

తప్పటడుగులు వేసి చప్పటులు గొట్టుచూ
ఆటపాటలతోని యలరేటి బాలుడూ
నూనూగు మీసాల నూత్నయౌవనముతో
కనిపించు మాధవుని గాంతునే కన్నార ?

పసిడి గజ్జియలతో బంతిపూదండతో
నెమిలిపింఛముతోని నేర్పుతో నా చుట్టు
వెన్న బెట్టుమటంచు సన్నటి గొంతుతో
రోదించు బాలకుని రూపమే మారినది

అందటి వాడతడు నందుకొను వారలకు
వేలగోపికలతో విహరించినా గూడ
నా చిన్ని కృష్ణుడే నా మనసు నందుండు
మురళి బాడేటి యా ముద్దు గోపాలుడూ

ఎంత వాడాయెనే ! వింతగా కృష్ణుడూ
చంటి తనములు మాసె సఖుడాయె గోపికల

## కఱిగి పోనిమ్మా!

కఱిగి పోనిమ్మా! నీ కమ్మనీ మురళిలో
నిలిచి పోనిమ్మా! నీ నీడలో కృష్ణా!

నే పాడినా పాట నీ చరణ సన్నిధిని
భ్రమరముగ యాడుచును పాడుకోనిమ్మా

కఱిగి పోనిమ్మా! నీ కమ్మనీ మురళిలో
నిలిచిపోనిమ్మా! నీ నీడలో కృష్ణా!

మురళి స్వరములతోని ముద్దుగా పాడేటి
నిను కనుల జూచుచును నిలిచి పోనిమ్మా
చిఱు గజ్జియలు మ్రోత జిందేటి నృత్యమున
నేనొక్క సఖియనయి నిలిచి పోనిమ్మా!

నీ రాసకేళిలో నేనొక్క గోపికగ
నాట్యమాడగనిమ్మ నవరాగి సుధలా
విశ్వసౌందర్యమను విమల పద్మమునందు
నన్నొక్క రేకగా నాథ! నిలువగనిమ్మ!

నిను విడిచి మనలేను! నీ గీతి విడలేను
ఎన్ని జన్మలకయిన ఏనాటికయినా
నీ వేణు నాదాన! నీ యందచందాల
కఱిగిపోనీ కృష్ణ! కాంతిలో! శాంతిలో!

కఱిగిపోనిమ్మా! నీ కమ్మనీ మురళిలో
నిలిచిపోనిమ్మా! నీ నీడలో కృష్ణా!

# మరల పాడుము కృష్ణ !

మరల పాడుము కృష్ణ! మధురమౌ నీ మురళి
మది చివురులెత్తగా మనసార విందూ

కలిసి పాడెద స్వామి! కమనీయ గీతమును
ప్రకృతి పూవులు చూచి పరవశము జెందగా

మరల పాడుము కృష్ణ! మధురమౌ నీ మురళి
మది చివురులెత్తగా మనసార విందూ!

ఎన్నిసారులు విన్న కన్న! నీ మురళినీ
చిన్ని నా మనసేమొ చింత బాయదుగదా
కలకాలమును నీదు కమ్మనీ మురళినీ
కఱిగి పోవగకోర్కె గరుణింపకున్ననూ!

అందెలల్లాడగా నచ్చరను నే నగుదు
వలపు చిలికీ వేయి వన్నెలను జిందెదను
ఎదుట నున్నటు నీవు నింపు గులుకుచు నుందు
కిన్నెరను గొంతెత్తి కీర్తనను బాడుదును!

పాడినా మురళినే పాడమని యాచింతు
ఆడినా యాటనే యాడమని కోరుదును
చూపినా మోమునే జూపమని వేడుదును
బండి చక్రములాగు బ్రదుకంత దొరలగాఁ

మరల పాడుము కృష్ణా! మధురమౌ నీ మురళి
మది చివురులెత్తగా మనసార విందూ!

# నే నాపలేనమ్మ !

నేనాపలేనమ్మ! నే నాపలేనే
మనసులో విరిసినా మధుర భావాలూ

వేణు రవములు నాకు వినిపించు చుండునే
కొండకోనలలోని కోకిలా పాడినటు

నేనాపలేనమ్మ! నేనావలేనే
మనసులో విరిసినా మధుర భావాలూ !

పచ్చ పచ్చని చేల పైరు గాలులు వీవ
పడి లేచుచున్నటుల భావ బంధురములై
నా మనసు పక్షిలా నలు మూలలకు నెగిరి
చిన్నికృష్ణుని జూడ జిందులాడుచునుండు!

వెన్నెలను దిలకించు కన్నె కలువకు మల్లె
మబ్బుజూచు మయూరి మధుర నృత్యములాగు
తీయనీ భావాల యూయలను నూగుచును
పరువెత్తుచుండునే! పారవశ్యముతోని!

ఏ పొదల నే తరుల నే పూల తీవెలను
దాగి యున్నాడో! నే దరిజేరి వెదకుతును!
నీలి మబ్బులయందు నిలిచియున్నను గూడ
దర్శింతు తమిదీర దాచుకుందును నెదను!

నే నాపలేనమ్మ! నే నాపలేనే
మనసులో విరిసినా మధుర భావాలూ!

## ధురమగు నీ రూపు !

ురమగు నీ రూపు మనసులోపల దలప
నసము పులకించి మధుమాసమాయే

పూదీవె నవ్వినటు చూపులే పూచినవి
నా మనసు విరిసినది నవభావ గీతాల

ురమగు నీ రూపు మనసులోపల దలప
నసము పులకించి మధుమాసమాయే!

ి నీలాకాశ నీలిమను దేలినటు
బ్బ కన్నెలతోని మాటాడినటులుండు
ఁలను దాకుతూ తూలినటు జాబిల్లి
ందాలలో కదిలి యలరినటు బాడుతూ

ప్పూ పొదలందు మాధవీ లతలందు
నీయ రూపమున కనిపించినటులుండు
కగపడకుండ కమనీయ రూపమున
సునను విహరించి మమత పెంచెదవేల?

మనో నేత్రమున నయగారములు జింద
పంచెదవుగాని కరుణ జూపెదుగాని
లు దెరచిన కంటి కగుపడవదేలనో
త్రనీ మురళితో గలత బాపవదేల?

మధురమగు నీరూపు మనసులోపల దలప
మానసము పులకించి మధుమాసమాయే!

# తూరుపే నవ్వింది!

తూరుపే నవ్వింది! తులకించె గుంకుమలు
సరసిలో దామరలు సహజకాంతులు విరిసె

మురళీ స్వనము తేవో మురిపెముగ వినిపించె
హరివిల్లులా మనసు అలరింది భక్తితో

తూరుపే నవ్వింది! తులకించె కుంకుమలు
సరసిలో దామరలు సహజ కాంతులు విరిసె

ఎచ్చటో వినినటుల నెప్పుడో కనినటుల
ఆ మురళి స్వనముతే! ఆ మధుర నాదమే
ఆ మురళి కృష్ణుడే యందాల మురళితో
వినిపించుచున్నటుల వీనులకు ననిపించె

మనసంత మధురిమల మమత దాకినయటుల
ఆనంద హర్షములు అలరి నను ముంచినటు
పిల్లనా గ్రోవి యా పిలుపులని యనిపించె
నను పిలుచుచున్నటుల నవరాగ సుధలతో

ఈ సుప్రభాతమున యీ శుభోదయవేళ
కంటి కగపడరావ! కలవరము దొలగగా
కనిపించి శ్రీ కృష్ణ ! కమనీయ స్వరములను
మురళితో నొకపాట మోదమున బాడవా

తూరుపే నవ్వింది! తులకించె గుంకుమలు
సరసిలో దామరలు సహజకాంతులు విరిసె

# అలనాటి మన తీపి

అలనాటి మన తీపి వలపు గాథలు కృష్ణ
చిత్రించితిని జూడు! చిత్రాతిచిత్రముగ

చిన్ని నా హృదయమొక చిత్రశాలగ మారె
తిలకింపు మొకసారి తీయగా స్మరియింపు

అలనాటి మనతీపి వలపుగాథలు కృష్ణ
చిత్రించితిని జూడు! చిత్రాతి చిత్రముగ

మల్లెమాలతి లతల మాలతీ కుంజముల
దాగినా నినుజూచి దరిజేరి వేగమున
కరముబట్టితి జూడు! కారుణ్యమును గోరి
రంగు రంగులనున్న రమణీయ చిత్రమును

దూరమున వనవీధి దోరముగ నీ మురళి
నిస్వనాలను వినీ నినుజేరి భక్తితో
ప్రణమిల్లు చిత్రమిది పరికింపు మొకసారి
కాటుకను కన్నీరు కలిపి వ్రాసిన దోయి

మధుర స్మృతులన్నిటిని మఱచిపోకుండునటు
చిత్రించి చిత్రములు జేర్చితిని వరుసగా
నా హృదయమందిరము నయముగా దయచేసి
ఆనాటి సొగసులను అలర జూడుము కృష్ణ

ఆనాటి మనతీపి వలపుగాథలు కృష్ణ
చిత్రించితిని జూడు! చిత్రాతి చిత్రముగ

# నీ పయన మెచటికో!

నీ పయన మెచటికో! నా పయన మటికే
వెంటనే వచ్చెదను జంటగా కృష్ణా

నీ యడుగు జాడలను నే నడచి వచ్చెదను
నీ నీడలో నడుతు నిండారు మనసుతో

నీ పయన మెచటికో! నా పయన మచటికే
వెంట నే వచ్చెదను! జంటగా కృష్ణా

కనులింత జేసికొని గాంచుచుంటిని స్వామి
పగలు రేయీ యనక బలవరించుదు నుంటి
నీలి గగనమునందు నిలిచినా చుక్కలను
నిండు చందురుని నే నిలిపి యడుగుచు నుంటి

నీకు బందీనై తి నిజముగా గోపాల
నీతోని గొనిపొమ్ము! నీ వెచట నుండినా
క్షణమైన నిను విడిచి చరియింపలేనోయి
నీ మురళి వినక నే నిముసముండగలేను

తిరిగి చూడుము కృష్ణ! తీరుగా నొకసారి
తీయనీ నీ వలపు దేనెలాలికింపుమా
నీవు జంద్రమత నగుము నే జకోరిక నగుదు
అనుభవింతుము స్వామి! ఆనంద మధురిమలు

నీ పయన మెచటికో! నా పయన మచటికే
వెంటనే వచ్చెదను! జంటగా కృష్ణా

# మురళి నూదువాడవని

మురళి నూదువాడవనీ
ముద్దు కృష్ణ యని పిలువగ
నర్తనలను మురిపించుచు
నా ముంగిట దిరుగవేమి?
మురళి నూదు వాడవనీ
ముద్దు కృష్ణ యని బిలువగ

గోవిందా! యని పిలువగ
కోర్కెదీర బలుకవేమి?
నారాయణా! యని బిలువగ
నా కనులను నిలువ వేమి?

వెన్నదొంగ యనుచు బిలుక
వేడుకలర పరువు లెత్తి
తలుపు చాటు దాగియుంటి
తగ దర్శన మీయవేమి?
'గోపబాల' యనుచు బిలువ
గోపబాలకులను గూడి
ఆనందమ యదరించుచు
నాటలాడవేమి స్వామి?
'మురళీధర' యని పిలువగ
ముద్దులొలుక మురళి నూది
నా మనసును సపరంగుల
నవ్యసుధల దేల్పవేమి?

## మానసము వికసించి

మానసము వికసించి మల్లైతే పూచినవి
మధుమాసమిది గదా! మాధవా! రమ్మా

చివురు పూవులతోని చిత్రమగు మాలతో
పూజింతు మాధవా! పులకరించే మదిని

మానసము వికసించి మల్లైతే పూచినవి
మధుమాస మిదిగదా! మాధవా! రమ్మా

తరులన్ని చిగురించె తన్మయము దులకింప
కోకిలల పాటలను గొమరొప్ప వనవీధి
పుష్పాదుల రాసులను బులకించి ధరణినీ
మకరంద జాలులను మధురిమల నొలికినది

వినిపించకున్ననూ కన్నులను నీ మోము
కలిసి పోయెను గదా! కమనీయ రాగమున
మనసులో నిండినది మాధవా! నీ రూపు
రంగు రంగులలోన రమణీయ చిత్రముగ

మధురభావాలతో మనసూగుచున్నదీ
చైత్రమాసములోని చివురులా పూవులా
నీ మురళి వినిపించి నీ మోముజూపించి
నీ జ్యోతిలో జేర్చు నిండయిన దయతోని

మానసము వికసించి మల్లైతే పూచినది
మధుమాసమిదెగదా! మాధవా! రమ్మా

# నీ దాననోయ్ కృష్ణ!

నీ దాననోయ్ కృష్ణ! నీవు నా వాడవోయ్
నింగి చుక్కలు వినగ నినదించు చుంటి

నీవు నా గతి వనుచు నీవు నా పతివనుచు
నదిలోని యలలవలె నాట్యమాడుచు నుంటి

నీ దాననోయ్ కృష్ణ! నీవు నా వాడవోయ్
నింగి చుక్కలు వినగ నినదించుచుంటి

పూలతలు తరు బ్రాకి పులకరించిన లాగు
తుమ్మెదలు పూలపై తూలి పాడినయటుల
నిను మనసునను నిలిపి నీటుగా నా మనసు
ఆడి పాడును కృష్ణ! అప్సరసకును వోలె

మేఘమాలనుజూచు! మెఱుపు డీగెల జూచు
అందాలు జిందేటి హరి విల్లులో జూచు
పంట చేలను జూచు! పడతి యొడిలోనున్న
పసిపాపలో జూచు! బంగారు కొండ నిను

విడదు నా మనసు నిను వేయిజన్మలకయిన
ఆత్మీయతను జూపి యడుగు జాడల నడుచు
పాడుకొను నీ పాట పరిమళము జిందగా
వన్నెపిల్లకు మల్లె కలలెన్నొ గాంచునూ

నీ దాననోయ్ కృష్ణ! నీవు నా వాడవోయ్
నింగి చుక్కలు వినగ నినదించు చుంటి

# ఆడియాడి నే నలసితి కృష్ణా!

ఆడియాడి నే నలసితి కృష్ణా
పాడిపాడి నే పరవశ నయితిని
        వెన్నెల దీపెగ వెలవెలబోవుచు
        కన్నె మనసులా కలవర బడితిని
ఆడియాడి నే నలసితి కృష్ణా
పాడిపాడి నే పరవశ నయితిని

కలువల వలె నే గన్నులు దెఱచీ
నింగినీలమున నిలుపరించితిని
ఎత్తినమోమును వసుధను వాల్చక
చిత్తము నీపై చిలకరించితిని
కోకిల పాటగ కొండకోనలను
పాడుచు నిను నే బలవరించితిని
మాటి మాటికిని మధుర మురళినీ
మర్మముగా ధ్వనియించు టెందుకో
ఆట పాటలను నేర్పితి వెందుకు?
ఆశల మది జనియించితి వెందుకు?
మాటిమాటికిని మధుర మురళినీ
మర్మముగా ధ్వనియించు టెందుకో
అంతులేని యీ యాకసమందున
విలువలేని యీ నీరధి యందున
ఎగురలేను! నే నీదగజాలను
గమ్యము జేరిచి కథ ముగింపుమా

## అడుగడుగున

అడుగడుగున నా నీడను
అనుసరింపబోకు కృష్ణ
కన్నెవలపు సిగ్గుతోడి
కదిలిపోవు చుంటినోయి! ॥అడుగడుగున॥

మోహనమగు మురళినాది
మూర్ఛనలను దేల్పకోయి
విరహజ్వాల నన్ను ముంచి
వేదన గలిగింపకోయి ! ॥అడుగడుగున॥

వెంటరాకు చిన్నికృష్ణ
ఇంటివారు జూతురయ్యా
ఒంటి విడువ వెందుకు నను
జంట గూడియుందువెపుడు! ॥అడుగడుగున॥

మనసునందు నిలిచి నీవు
మాధుర్యము నొలకబోసి
పాటలలో నిలిచి నీవు
పారవశత గలిగింతువు! ॥అడుగడుగున॥

చిఱుకాంతుల దీపము నే
దివ్యకాంతి జ్యోతి నీవు
నీయందున జేరినపుడు
నిత్యశాంతి నాదు బ్రతుకు! ॥అడుగడుగున॥

# నీ మురళినాదాల

నీ మురళినాదాల నిఖిలమంతా కదిలి
అందాలు వికసించి యమృతంబులొలుకూ

నింగి తారలుగూడ నినదించు శ్రుతిలయలు
వెన్నెలా దీవె లలి వనవీధి నటియించు!

నీ మురళి నాదాల నిఖిలమంతా కదిలి
అందాలు వికసించి యమృతంబులొలుకూ!

ప్రకృతి యందాలలో పరిమళము లొలుకుచూ
అణువణువు పులకించి యపురూపముల దొలుకం
చల్లగాలులు గూడ సంగీత ధ్వనులతో
గూటిలో గువ్వలకు కువకువలు గలిగించు!

చివురు పువ్వులయందు చిత్రమగు ధ్వనులేవొ
రెమ్మ కొమ్మలయందు రివ్వుమను స్వనములూ
పూల తీవెలలోని బులకించు కుసుమములు
మధురగీతము లేవొ! మనసులో బాడుకొను!

నీ మురళిలో గలియ నిలిపినా మనసుతో
జన్మ జన్మలనుండి జపియించు దాసినీ
కలుపుకోవేమి నను కమ్మనీ మురళిలో
నిలుపుకోవేమి నను నీడలో నిత్యముగ!

నీ మురళి నాదాల నిఖిలమంతా కదిలి
అందాలు వికసించి యమృతంబు లొలుకూ!

# పాడేటి తుమ్మెదా !

పాడేటి తుమ్మెదా! బంగారు బొమ్మకదు
ఒకమాట తెలుపుమా! ఒయ్యారముగనూ

మురళినూదే స్వామి! మోహనాంగుడు సఖి
కనిపించెనా తెలుపు! కనికరించీ నన్ను

పాడేటి తుమ్మెదా! బంగారు బొమ్మకదు
ఒకమాట దెలుపుమా! ఒయ్యారముగనూ!

నెమిలిపించము దాల్చి నెమ్మనము దయతోని
సకలజీవులను దా సాది కాపాడునూ
కన్నిట నను ముంచి కనిపింపకున్నాడు
వెదుకుచుంటిని చెలి! వీధి వీధులయందు!

కన్నెరను జేపట్టి గిరులందు దరులందు
కన్నిటి పాటలను గలగి బాడుచునుంటి
రాడాయె నాస్వామి! రాలు గఱిగెనుగాని
ప్రేమ జూపనివాని బెండ్లియాడితినమ్మ!

మురళితో నన్నెపుడు మోదమున బిలుచునూ
మధుర గీతముల నే మాధవుని బిలిచెదను
కనిపింపకుండ నను గాఱడవులను ద్రిప్పి
వేధించుచున్నాడు విధి నేమి నిందింతు?

పాడేటి తుమ్మెదా! బంగారుబొమ్మకదు
ఒకమాట తెలుపుమా! ఒయ్యారముగనూ!

# నా గొంతులో పాట

నా గొంతులో పాట నలిగిపోయినదమ్మ
గోవిందునీ కొఱకు కొసరి కొసరీ పాడి

నే పాడుకేగాని నాపాట వినడమ్మ
తన మురళిపాటనే తా పాడుకొను గాని

నా గొంతులో పాట నలిగిపోయినదమ్మ
గోవిందునీ కొఱకు కొసరి కొసరీ పాడి !

మనసార నే బలుకు
మాట వినడోయమ్మ
తారవలె దూరముగ
తరలిపోవుచునుండు !

అంజలిని గైకొనడు
ఆదరింపడె చెలిమి
కన్నార ననుజూచి
కనికరింపడె సఖి !

ఆనాడె దాసినని యెంచి పలికినగాని
తీయనీ పాటలను తేనెలొలికినగాని
అలసిపోయితినమ్మ! సొలసిపోయితి సఖీ
విరహ వేదనలతో వేసారి! వేసారి!

నా గొంతులో పాట నలిగిపోయినదమ్మ
గోవిందునీ కొఱకు కొసరి కొసరీ పాడి !

అందాలు చందాలు

అందాలు చందాలు! ఆటపాటలుగాని
ఆతనికి నచ్చవట! అదియేమి చిత్రమో

వేదనల రోదనల విలపించు జీవులను
కన్నీళ్ళు దుడుచునట! తన బాధగా దలచి

అందాలు చందాలు! ఆటపాటలు గాని
ఆతనికి నచ్చవట! అదియేమి చిత్రమో!

పాలరాళ్ళను నున్న బంగారు భవనముల
విహరింపగోరడట! విమల సౌందర్యముల
పూరి పాకలలోన పుట్టెడూ దుఃఖాన
దినము గడిపేటి యా దీనులందుండునట!

బంగారు టంచులను బట్టు పీతాంబరము
దా కట్టుకొనడతే తన్మయత్వముతోని
చినిగి తునిగిపోయి చిదపలయి పోయినా
వలువలున్నావా రె! వరుస చుట్టాలంట!

పీదసాదలె వాని ప్రియమైన బంధువులు
ఆర్తులే యతగాని యాత్మీయులట చెలియ
తెలియతేనై తినే చిన్న గోపాలునీ
మనసు పోకడలనూ! మఱి తీరుతెన్నులను!

అందాలు చందాలు ఆటపాటలుగాని
ఆతనికి నచ్చవట! అదియేమి చిత్రమో!

# ఏనాటి స్నేహమిది ?

ఏనాటి స్నేహమిది? ఏనాటి బంధమిది?
విడిపోనిదని కృష్ణ! వివరింపవలెనా?
    సతిపతుల కున్నట్టి సఖ్యమిది పరమాత్మ
    ఆత్మ పరమాత్మలా యనుబంధమోయీ
ఏనాటి స్నేహమిది? ఏనాటి బంధమిది?
విడిపోనిదని కృష్ణ! వివరింపవలెనా?

జన్మ జన్మల నిన్ను జేరుకొన యత్నించి
ఆటుపోటుల జలధి యలజడుల లోనయితి
కనికరమునా నీకు కారుణ్య మిటురాదు
కమ్మనీ నీ చరణ కమలముల జేర్చవుగ!
సెలయేటివలె నేను జాలుగా ధ్వనియించి
నీ పాటలను భక్తి నిండుగా బాడితిని
విరహవేదన రగిలి వేయి శిఖలాయెగా
కరుగదే నీ మనసు కరుణారసము బొంగ!
ఎన్ని మధుమాసాలు నిలజారిగిపోయెనో
ఎన్ని హేమంతాలు నిల కరిగి పోయెనో
నీ వేణునాదాలకయి నే దపించుచును
కోకిలగ నే నెన్ని కోనలను దిరిగితినా!
నన్ననీ మురళితో జాగుసేయక రమ్మ
తీయగా శ్రుతిలయల దేనెలను దేలింపు
మనసార నేనొక్క మధురగీతము బాడి
అమృతసారపు ధ్వనుల యలలలో గలియుదను!

# కలలోన కనిపించి

కలలోన కనిపించి కలత రేపకు కృష్ణ
పరవశము జేయకుము పాటలో నిలిచీ

తీయనీ నీ మురళి దీవెలను గురిపించి
ఆనంద ద్వీపాల యంచులను జేర్పకుము

కలలోన కనిపించి కలత రేపకు కృష్ణ
పరవశము జేయకుము పాటలో నిలిచీ!

నను విడువ వెందుకని? నను వదల వెందుకని?
నా మనసులో నిలిచి నలిగిపోయెదవేల?
నా భావగీతమున నాట్యమాడెదవేల?
చిఱు గజ్జియలతోని చిత్రాతి చిత్రముగ!

వెన్నెలను తిన్నెలను చిన్ని పూ మొక్కలను
చిగురులను పువ్వులను చిందు గిరివాగులను
సన్నని మురళితో సరసముగ శ్రుతిలయల
తూలజేసెదవు నను దుమ్మెదగ వనవీథి!

అంత ప్రేమున్న నను నింతగా వేధించి
కన్నీటివాగులో గలత బఱచెదవేల?
జేర్చుకొనరాద! నీ చెన్నొందు మురళిలో
మధుర నిస్వనముగా మాధుర్యమొలుకగా!

కలలోన కనిపించి కలతరేపకు కృష్ణ
పరవశము జేయకుము పాటలో నిలిచీ!

# ఏమని వెదకగ బొమ్మా!

ఏమని వెదకగ బొమ్మా! వేగ గగనానికి
పంజరములోనున్న బంగారు చిలుకా

మబ్బులను నున్నాడా! మధురముగ జుక్కలను
నక్కియున్నాడేమొ! చిక్కెనో వెన్నెలల

ఏమని వెదకగ బొమ్మా! వేగ గగనానికి
పంజరములోనున్న బంగారు చిలుకా!

పరుగెత్తు మబ్బులను బవళించి యున్నాడొ
సరిచినా జాబిల్లి నీడలో నున్నాడో!
అంబరము సొగసులో నతికియున్నాడేమొ
వినిపెట్టి గాంచవే! వినిపించు శ్రుతిలయలు!

ఏచట నుండినగాని యింపుగా వినిపించు
పసి పక్షియుల ధ్వనులు చిత్రాతి చిత్రముగ
మురళినూదుచు నుండు మోదమును వర్షించు
అంపమానందములు సంతతను విరియునే!

నా వేదనంతయును నయముగా వినిపించు
వెన్నెల కౌలకులను కలువలే పూచెనను
ప్రతిపదము నిను దలచి పతి లేచుచున్నదను
చిన్ని చికురాకుగా చిత్రముగ మారెనను!

ఏమని వెదకగ బొమ్మా! వేగ గగనానికి
పంజరములోనున్న బంగారు చిలుకా!

# పరువెత్తుచున్నవి

పరువెత్తుచున్నవి! పవలు రాత్రులు కృష్ణ
వారాలు నెలలునూ! వత్సరంబులునూ

నీ మురళి వినరాదు! నీ జాడగనరాదు
నిండయిన నీ సొగసు నీటులే గనరావు

పరువెత్తుచున్నవి! పవలు రాత్రులు కృష్ణ
వారాలు నెలలునూ! వత్సరంబులునూ

అల గజేంద్రునివోలె నాలపించుచు నుంటి
అలనాటి శబరివలె నలరి జూచుచు నుంటి
అంజలిని ఘటియించి యాత్మార్పణంబనుచు
నిలిచి యుంటిని స్వామి! నీ రాక జూచుచును

పిలిచి పిలిచీ నిన్ను ప్రేమ బొంగారగా
కనురెప్ప వాల్పకను గాంచు చుంటిని సఖా
కంటికగుపించినను గారవింపవదేమి?
ప్రియదాసి నగు నన్ను ప్రేమ జూడవదేమి?

కాలమంతయు నిటుల గడిచిపోవుటయేన?
పూల తావులుమాసి పుడమిరాలుటయేన?
దివ్య దర్శన మిచ్చి దీనురాలిని బ్రోచి
కథ ముగింపుము! స్వామి కల్యాణగుణధామ

పరువెత్తు చున్నవీ పవలు రాత్రులు కృష్ణ
వారాలు నెలలునూ! వత్సరంబులునూ

## విభుడొచ్చునట చెలీ!

విభుడొచ్చునట నాదు ప్రభువొచ్చునటవే
మురళీ నూదేవాడు ముద్దుగా భువికి

చిఱుగజ్జియలతోని చిన్నారి నర్తనల
గోపబాలురతోని గూడి వచ్చేనంట

విభుడొచ్చునట నాదు ప్రభువచ్చునటవే
మురళీ నూదేవాడు ముద్దుగా భువికి

అంతరిక్షము నుండి యాకాశమార్గాన
నక్షత్రంలను రిక్కలను సుదూరంబుగ దిగుచు
మబ్బు తెరలను విడుచు మాధవుడు వసుధపై
అడుగుపెట్టునటంచు హరివిల్లు తెలిపినది

కొండ కోనలు దాటి కోనేరులను దాటి
అడవులను దాటి పచ్చని మైదానముల
దాటుకొనుచును వేగ తన్మయతతో నాదు
[illegible] దాను ఎదవెత్తి వచ్చునట

నా గీతికల వినుచు కరిగి దా బోయెనట
నా విరహమును వినుచు వంతదా బొందెనట
నమ్మించి మురళితో కనికరము జూపించి
తన కాంతి కిరణమున నను జేర్చుకొనునంట

విభుడొచ్చునట నాదు ప్రభు వొచ్చునటవే
మురళీ నూదేవాడు ముద్దుగా భువికి

# కలిసి మన మిరువురము

కలిసి మన మిరువురము గాపురము సేయుదము
వినువీధి వెన్నెలల వేడుకను గృష్ణా

చిన్ని చుక్కలమధ్య చిన్నారి మబ్బులను
జంటగా విహరించి సయ్యాట లాడుదము

కలిసి మన మిరువురము గాపురము సేయుదము
వినువీధి వెన్నెలల వేడుకను గృష్ణా

మురళి పాడగ నీవు మోదమున గొంతెత్తి
పాట బాడగ నేను పారవశ్యము జింది
అచ్చరలు కిన్నెరలు ఆటలాడుట మాని
మనవైపు జూచెదరు మాధవా! చిత్రముగ

వెన్నెలా దీవెలను వేడుకనుమీటగా
నే నాట్య మాడెదను నలరి నర్తకి వోలె
అలరాసకేళిలో నందాల గోపికగ
ఆకాశ మంతయును నలరేను శ్రుతిలయలు

ఈ పుడమిపై దయను నింపొంద గైకొనక
వేదనల తెరలలో వెస నన్ను ముంచితివి
వినువీధినైన నను వేడుకను గాతునని
వేడుచున్నా నిటుల వేగ గావగదోయి

విను వీధి వెన్నెలల వేడుకను గృష్ణా
కలిసి మన మిరువురము గాపురము సేయుదము

## తీయని నీ మురళీ

తీయనీ నీ మురళి దేనెలను నే దగిలి
బయటబడకున్నాను బాధింపకోయీ

నా మనసు అణువులయి నలువైపులా చెదిరి
పంచభూతములలో బడిలేచుచున్నదీ

తీయనీ నీ మురళి దేనెలను నే దగిలి
బయట బడకున్నాను బాధింపకోయీ

నీ మురళి కుసుమమున నే తుమ్మెదను నయితి
మత్తులో నే మునిగి మై మఱచి పోతినీ
అన్ని మఱచితి నేను నందజని మఱచితిని
ఎవరెవని యడుగ నే వినరింపలేనయితి

ఆడిపాడుచు నుంటి! యలరి యేడ్చుచు నుంటి
నవ్వుతూ త్రుళ్ళుతూ నాట్యమాడుచునుంటి
మురళి చేధరియించి మోహమున ముంచితివి
చిత్రమగు బొమ్మగా జేసితివి ధరయందు

కనుల గనిపింపకిటు కార్పణ్య మేలనో
చెవులకింపును గూర్చి చేటు దెచ్చితివీ
దాసివగు నన్నిటుల దయవల్ప కించుకయు
మైకమున ముంచుటేది మఱి నీకు న్యాయమా?

# విలపించు టెందుకో !

విలపించు టెందుకో! పలవించు టెందుకో
వేదనల ముసుగులో వెతబొందు టేలా?

గడచినా కాలమున కథలన్ని దలుచుకుని
కన్నీటి కాలువల కలత యిపుడెందుకో

విలపించుటెందుకో! పలవించు టెందుకో
వేదనల ముసుగులో వెతబొందు టేలా?

మధుమాసమది గడిచె! మధురక్షణములు బోయె
విభుడంపినా లేఖ వీక్షింపనైతిగా
రమ్మనీ కబురంపె రాజీవ నేత్రుడూ
కనక విన కెందుకో! కలత నలతలు యిపుడు!

కంఠమెత్తి విభుని గానమును జేయకను
శ్రీ చరణములపైని జిత్తముంచక యిపుడు
శిశిరమొచ్చినదనుచు జింత వంత లవేల?
కలవరింపగనేల? కటిక చీకటి యనుచు!

కనులముందర విభుడు కమనీయ రూపమున
పిలిచినను నే వినక ప్రీతి జూపకబోతి
మధుమాస మేగెనని! మాధవుడు రాడనీ
చింతింప పని యేమి? చేసినా తప్పనకు?

విలపించుటెందుకో! పలవించుటెందుకో
వేదనల ముసుగులో వెతబొందు టేలా?

# విశ్వమోహనమైన

విశ్వమోహనమైన వేణువును జతగూడి
ఆలపింపకపోతి! ఆనాటి రాత్రి

శ్రీ చరణములపైని చిత్తముంపకపోతి
భక్తితో రక్తితో భజన సేయకపోతి

విశ్వమోహనమైన వేణువును జతగూడి
ఆలపింపకపోతి! ఆనాటి రాత్రి!

నాతి వచ్చెనెనే! నన్ను బ్రోవ కృష్ణుడూ
మల్లె పొదరింటిలో మాధవీలత క్రింద
పాట వినిపించెనే పరమ ప్రీతిని తాను
నను బాడుమనియెనే నర్మముగ మురళితో!

పెదవి కదిపి పాట ప్రీతి బాడగలేక
సిగ్గు దొంతరలలో సింగారమైపోతి!
మల్లెమాలతి పూల మధురముగ దోలిసిని
అతని పాదములపై యర్పించితిని సఖి!

పాడ జాలకపోతి! పల్లవిని శ్రుతిలయల
విమలమౌ నా వినతి వినిపింపనైతినీ
సిగ్గునిగ్గులు తొలగి చిదిమినా దీపముగ
వినిపించుటెన్నడో! విభుని యెదుటను వినతి!

విశ్వమోహనమైన వేణువును జతగూడి
ఆలపింపకపోతి! ఆనాటి రాత్రి!

# నిను మఱచినా కృష్ణ !

నిను మఱచినా కృష్ణ! నను మఱువబోకుమా
నా పైని నీ ప్రేమ నలిగిపోనీకుమా

నా ప్రేమగీతిలో నవ్యతను మాపకుము
కలత గలిగింపకుము! కల్యాణ ధామా

నిను మఱచినా కృష్ణ! నను మఱువబోకుమా
నాపైని నీప్రేమ నలిగిపోనీకుమా!

వేదనల రాశిలో విహరించు నా బ్రదుకు
కటిక చీకటితెరల కరుణతో దొలగింపు
కాంతి కిరణము జూపి కమనీయ కాంతిలో
నా హృదయ వేదికను నవ్యతలు నింపుమా!

శిశిరమది యేతెంచె చిన్నారి పొన్నారి
చిగురాకు పదములను జేర్చి గూర్చగలేను
గొంతెత్తి కోనలో కోకిలకువలె బాడి
మాధవా! నిను బిలిచి మనసు నిలుపగలేను

మనసాయె మందకొడి! మధుర భావాలన్ని
అణగిపోయినవి ప్రభు! ఆత్మలో శ్రుతిలయలు
నా ప్రేమగీతమది నలిగిపోవుచునుండె
బాగమంచు గ్రమ్మినది పొలుపార నీ రూపు

నిను మఱచినా కృష్ణ! నను మఱువబోకుమా
నాపైని నీప్రేమ నలిగిపోనీకుమా!

# హృదయ పంజరమందు

హృదయ పంజరమందు! సదయ! రమణీయముగ
చిలుకగా జేసితిని చిత్రముగ కృష్ణా

ఎటు బోవకుండ నిను బట్టు ప్రేమ పాశమున
బంధించితిని కదా! బయలుబడి పోలేవు

హృదయ పంజరమందు! సదయ! రమణీయముగ
చిలుకగా జేసితిని చిత్రముగ కృష్ణా!

తేనెధారల దడిపి తీయనీ రాగముల
అందించుచుంటినీ యాహారమును నీకు
మధుర గీతములతో మాధుర్య నీరమును
త్రాగించుచుంటినీ! తన్మయము జెందగా!

కిన్నెరను మ్రోగించి కిలకిలా నవ్వించి
బంగారు మువ్వలను బదములకు గట్టితిని
రాత్రి బవళులు నీకు రమియించు సేవలను
కనులు మూయక నిన్ను గనుచుంటి రక్తితో!

నిను మచ్చికను జేసి నిలిపితిని శ్రుతిలయల
బంజరము దెఱచినను బయలుపడిపోవుతే
ఎగురవేసినగూడ నెటుబోక దిరిగొచ్చి
మనసు పంజరమందు మఱిగుండ గోరెదవు!

హృదయ పంజరమందు సదయ! రమణీయముగ
చిలుకగా జేసితిని చిత్రముగ కృష్ణా!

# పాడింది కోకిలా!

పాడింది కోకిలా! ప్రణయగీతము నేడు
మల్లె పందిరి యందు మధురిమలు విరియా

కవిలోని భావాలు కమ్మనీ పాటలయి
అణువణువు పులకించె నలరి వాసంతమున

పాడింది కోకిలా! ప్రణయ గీతము నేడు
మల్లె పందిరియందు మధురిమలు విరియా!

ఆనందమున నాదు అంతరంగము పొంగె
మధురమగు నూహలను మానసము బొంగినది
చిన్ని కృష్ణుడు వనదు సింగారములతోని
నా హృదయ వీధిని నర్తనలు గావించె!

మురళి పాటను బాడి మోదమును గలిగించి
నవగీతమును బాడ నా మదిని బురిగొలిపె
లయతాళ రాగముల లలిత గీతము నొకటి
చివురు పూలకు మల్లె చిత్రింపమని దెలిపె!

కోనలో కోకిలలు గూడి బాడినరీతి
మలయ వీచిని దేలుకు మాధుర్యముల రీతి
అలరి ప్రకృతిలోని అందాలు విరిసినటు
పాట పాదాలంత పరవశింవగ తాను!

పాడింది కోకిలా! ప్రణయ గీతము నేడు
మల్లెపందిరి యందు మధురిమలు విరియా!

## పంటచేనీ పైని

పంటచేనీ పైని పాలపిట్టకు మల్లె
నీ పేరు దలచి నే నెగురుతుండాలీ

వెన్నెలా వానలో నిన్ను మది దలచుచూ
చిన్ని గీతము నొకటి చెన్నుగా బాడాలి

పంటచేనీపైని పాలపిట్టకు మల్లె
నీ పేరు దలచి నే నెగురు తుండాలీ!

మావి కొమ్మనుజేరి మధురముగ కుహూమనీ
తెలుగు పిట్టకు మల్లె తీయగా బాడాలి
గోరింకలాగు నే కొననిలిచి కడిమిపై
పలుకులను బలుకుతూ పరవశము జెందాలి!

సెలయేటి జాలులో విలపించి నీ కొఱకు
ఎదురీత నీదాలి! కదిలేటి మీనులా
ఏడు రంగులలోని యింద్రధనుసుకు మల్లె
నీలాంబరమునందు నే నిలిచి పోవాలి!

మల్లె పందిరిపైని మధురముగ జుమ్మనెడి
తుమ్మెదకు వలె నేను తూలుతూ పాడాలి
మంచు తెరలకు మల్లె మాటమంతీలేక
మధురభావముతోని మనసు నిను గప్పాలి

పంటచేనీపైని పాలపిట్టకు మల్లె
నీ పేరు దలచి నే నెగురు తుండాలీ!

## ఒకరొకరు వినకుండ

ఒకరొకరు వినకుండ! ఒకరొకరు గనకుండ
నీడగా! గోడగా! నిలిచినది యెవరో

మావలపు దీపెలను మధురిమల విడదీసి
దూరాన ద్రోసినా దోషులెవరో కదా

ఒకరొకరు వినకుండ! ఒకరొకరు గనకుండ
నీడగా! గోడగా! నిలిచినది యెవరో!

నా చిన్ని కృష్ణుడూ! నన్ను పిలిచేటి యా
మురళీ స్వనములందు మోదములు వినరావు
నా మధుర గీతిలో నాదాలు వినకుండ
పెనుగోల జేసేటి ప్రీతి బాంధవు లెవరో!

కనుజూపు మేరలో కాంతుడుండగ నన్ను
గలియకుండక జేయు గతినాత్మ లెవ్వరో
నా కర్మ బంధములు ననుపీడకుండగా
నీడగా నిలిచెనో! నిలిపి నను దూరముగ!

వేదనలు ఎన్నాళ్ళు? వెతలింక యెన్నాళ్ళు
అడ్డు నిలిచిన దెరలు అంతమగు టెన్నడో
శ్రీ మురళి శ్రుతిలయల జేరుటెన్నడు జరుగు?
దీపమున కిరణమై తేజరిల్లుట యెప్పుడు?

ఒకరొకరు వినకుండ! ఒకరొకరు గనకుండ
నీడగా! గోడగా! నిలిచినది యెవరో!

# తలుపు తెరువకు చెలీ!

తలుపు తెరువకు చెలీ! తగవేందు కతనితో
నా లోనె నే గుంది నలిగి పోవుదునూ

మనసు రాయిగజేసి మఱిమూగి నౌదునే
మధురమౌ పలుకులను మన్నింపనే చెలీ

తలుపు తెరువకు చెలీ! తగవేందుకతనితో
నాలోనె నే గుంది నలిగి పోవుదునూ!

మధురమౌ మురళితో మాయజేసి నన్ను
వంచి వంచించుకొని వగలాడు చిత్రముగ
విరహాగ్ని నను గాల్చి వేదనను ననుముంచి
ఇప్పుడొచ్చుచున్నాడు నింపొందు ముఖితో!

జాలిగుండేలేని దయలేని వానితో
స్నేహమెటు చేతునే! మోహమెటు కుదురునే?
అడవులన్నీ తిరిగి యరచి పిలిచితి వాని
మాట మాత్రము పలికి మదినొవ్వ దీర్చెనా?

బరువయిన నా గుండె బాధతో పలికితిని
కన్నీట తడిసి నే కలత పలికితినంతె
మనసిచ్చినా నాదు మాధవుని రాకకయి
తలుపుదీసి యుంచు దగస్వాగతం బిత్తు!

తలుపు తెరువకు చెలీ! తగవేందు కతనితో
నాలోనె నేగుంది నలిగి పోవుదునూ!

# వెన్నెలమ్మా! నన్ను

వెన్నెలమ్మా! నన్ను వేధింపబోకుమా
కన్నెపిల్లను సుమా! కలత బరుపకుమా

మురళి గోపాలునీ మోదమున వరియించి
మనసు గలిపితినమ్మ! మధురిమలు విరియగా

వెన్నెలమ్మా నన్ను వేధింపబోకుమా
కన్నెపిల్లను సుమా! కలతబరుపకుమా!

విరహవేదనలలో విలపించు నా మదిని
సూదులయి గ్రుచ్చు నీ సుకుమార కిరణాలు
వెన్నెలా పువ్వులను వేగ రాల్చి నాదు
మది విరహదాపమును మఱిపెంపబోకమ్మ!

వీణె దీవెలు మీటి విలపించు నా మదిని
వెన్నెలా దీవెలను వెసముందు బెట్టకుము
మధుర మూర్ఛనలతో మాధుర్యమున దేలి
అలలలో తెరలలో నటు మునిగిపోవుదును!

నీ పాలవెన్నెలను నిండారు కలశమున
మాధవునిపైనొంపు మధురిమలు జిందగా
జంట పక్షులవోలె జరియించెదము మింట
వెన్నెలా రేకలను వేగ మాపై జల్లు

వెన్నెలమ్మా! నన్ను వేధింపబోకుమా
కన్నెపిల్లను సుమీ! కలత బరుపకుమా!

# మనసులో నీ బొమ్మ!

మనసులోనీ బొమ్మ! మాధవునిపై ప్రేమ
ఇక జాలు! ఇక జాలు! విను నాదు మాటా

మాట మంతీ లేని మనసులేనీ విభుని
వరియింపదగునా? యిటు వన్నెలొలుకుచునూ

మనసులోనీ బొమ్మ! మాధవునిపై ప్రేమ
ఇకజాలు! నికజాలు! విను నాదు మాటా!

నట్టడవులను వెదికి నాతి! యలసితివింక
చిట్టడవులను వెదికి చిన్నబోయితివే
పాడినా పాటలకు ప్రభవింపలేదు దయ
కన్నీరు గార్చినవి కఠినమైనా శిలలు!

అరిగిపోయినవిగద! అందాల గజ్జియలు
చెరిగి పోయినవిగద! చెన్నొందు గాటుకలు
చిఱునవ్వు మాయమై సింగారములు మాసె
కన్నీటి ముత్తెములు కనులలో మిగిలినవి!

వచ్చునని మాధవుడు వర్జించి నా మాట
బంగారు కలలతో బడి లేచుచుంటివే
నీ గోల నాకేల నే నుందు దూరముగ
నీ ప్రేమ గోలలో నే దలను దూర్పనిక

మనసులోనీ బొమ్మ! మాధవునిపై ప్రేమ
ఇకజాలు! నికజాలు ! విను నాదు మాటా!

# తుమ్మెదా! వనమంత

తుమ్మెదా! వనమంత తూలుతూ పాడేవు
నాథు డగుపించెనా నయముగా దెలుపూ

శ్రీ మురళి నూదుచూ చిత్తమును దోచేటి
నవమోహనాంగునీ! నానాథు శ్రీకృష్ణు

తుమ్మెదా వనమంత తూలుతూ పాడేవు
నాథు డగుపించెనా నయముగా దెలుపూ!

మల్లెమాలతి పొదల మధురముగ గూర్చుండి
మధుర మురళిని నూదు మాధుర్యములు జింద
కడిమి నీడను నిలిచి కల్యాణి రాగమున
తీయగా బాడునే తేనె లొలికేటట్లు!

అడిగితిని హంసలను నల రామచిలుకలను
సెలయేటి చిఱుదెరల దలలొంచు దీవెలను
వనవీధినంతటిని వయ్యారమొలికేటి
తుమ్మెదా! తెలుపుమా! తోరంపు విభుజాడ!

విప్ప పువ్వులతోని విందులే జేయుదును
మందార మకరంద మధువులను ద్రాపింతు
విభుని జాడను దెలుపు వికసింప నా మనసు
కస్తూరి కుంకుమల గానుకలు నీకిత్తు

తుమ్మెదా! వనమంత తూలుతూ పాడేవు
నాథు డగుపించెనా నయముగా దెలుపూ!

## ఓరగా జూచుచూ

ఓరగా జూచుచూ! ఒయ్యార మొలుకుచూ
నాముందు నిలువుమా! నాథ! గోపాలా

చిత్రించుకొందు నే చిరకాల సఖునిగా
రంగురంగులయందు రమణీయ మూర్తిగా

ఓరగా జూచుచూ! ఒయ్యార మొలుకుచూ
నాముందు నిలువుమా నవమోహనాంగా

అలుపు సొలుపూలేని యాద్యంతమును లేని
బంధుమిత్రులు లేని బహుదూర యాత్రికుడ
నీ చిత్రపటము నే నిశిదినము జూచుచును
పలత నలతలులేని గమ్యమును జేరుదును

చిత్రపటమును జూచి చిత్రముగ జనులంత
మెవరనుచు ప్రశ్నింప నింపుగా దెలుపుదును
నా ఆత్మ బంధువని! నా జన్మ సఖుడంచు
అతని నీడను జేర నరుగుచుంటి నటంచు

చద్ది యన్నముమూట చంకనుంపుము స్వామి
ఆలమందల ముద్దు నదలించుచుండుమా
గోపబాలురతోని కూర్మియందము జింద
ఆటలాడుచునుండు! అదియె చిత్రించెదను

ఓరగా జూచుచూ! ఒయ్యార మొలుకుచూ
నాముందు నిలువుమా! నాథ గోపాలా!

# నా చిన్ని కనులతో

నా చిన్ని కనులతో నళినాక్ష! జూడనీ
విశ్వమంతా నీదు విమలమగు రూపూ

నా చిన్ని గొంతుతో నాథ! నను బాడనీ
విశ్వగానముతోని విమలముగ జతజేసి

నా చిన్ని కనులతో నళినాక్ష! చూడనీ
విశ్వమంతా నీదు విమలమగు రూపూ!

అణువణువు నంతటా యన్నిరూపములునూ
నీ రూపములుగదా! నిఖిలేశ! వందనము
ఆ రూపముల నేను నణువు పరమాణువును
ఎటుల జూతును స్వామి ఏకాంతముగ కనుల?

గ్రహతారకలుగూడ గదులుచున్నవి నీదు
మురళితో జతగూడి మోదమున శ్రుతిలయల
విశ్వగానముతోని వేడుకను శ్రుతిలయల
నన్నునీ గొంతునూ జతజేసి బాడుదును?

అయిన గూడను నాదు ఆశలన్నీ దీర్చి
మోపమును గూర్తువని మురియుచుందును స్వామి
కలలు గందును నీదు కమ్మని భక్తితో
ఎన్నెన్నొ కోరికలు! చిన్ని నా మనసునా!

నా చిన్ని కనులతో నళినాక్ష! జూడనీ
విశ్వమంతా నీదు విమలమగు రూపూ!

## కరుణతో భూమాత

కరుణతో భూమాత కౌగిలింపకమున్నె
నాథ! నీలో జేర నా కోర్కె దీర్చుమా

తొలి సంజ కుంకుమలు తొలగి పోవకమున్నె
అరుణకాంతుల యంచు యణిగి పోవాలి నే

కరుణతో భూమాత కౌగలింపకమున్నె
నాథ! నీలో జేర నాకోర్కె దీర్చుమా!

ఆషాఢ మేఘాలు అంతరింపకమున్నె
వర్ష ...ధార జలి వన్నె దరుగక ముందె
మెఱుపుతీగెలలోని మేలి బంగరు ఛాయ
చెదిరి పోవక ముందు జేర్చుకో! నీలోన!

పాటయాగక ముందు భావమాగక ముందు
గొంతులో రాగాల కొస మారిపోక మును
నీ మురళి రవములను నే జేరపోవాలి
నీ కాంతిరేఖలో నే కలిసి పోవాలి!

రమ్యమౌ మన చెలిమి రంగు మారకముందు
తియనీ తేనియల తీపు ఇఁడుగక ముందు
చేయూత నొసగి నను జేర్చుకొను శ్రీ మురళి
రాగానరాగమై రంజిలగ గీతిగా!

కరుణతో భూమాత కౌగిలింపక మున్నె
నాథ నీలోజేర నా కోర్కె దీర్చుమా!

# నే నాటి పెంచినది!

నే పుడమి నాటినది! నే నీరు బోసినది
పూదీవె పులకించి పూలు పూసినదీ!

నాథ! నా మనసులో నాటినా పూదీవె
పుష్పింపలేదుగా! బులకించి పరిమళము

నే నాటి పెంచినది! నే నీరు బోసినది
పూదీవె పులకించి పూలు బూసినదీ!

ఆదరింపు మటంచు నలరి నే బాడినా
మధురగీతములన్ని మాధుర్యమును దొలగె
గొంతులో శ్రుతిలయల కోమలత్వము మాసి
చేతిలో కిన్నెరయు జిత్రముగ గతిమారె!

వర్షధారలవోలె వడివడిగ కన్నీరు
వార్థిలో గలిసినది! వక్రముగ ప్రవహించి
మనసులో పెనుజింత మంచు తెరలకు వోలె
ఆకాశమంతటా యావరించెను గనుము!

కఠినత్వమును మాని కరుణజూడుము స్వామి
అలత కలతల బాపి యాదరింపుము ప్రేమ
పులకించి నా మనసుపున్నమీ రాత్రిగా
పూర్ణ నా కోరికను బుష్పింప జేయునూ!

నేనాటి పెంచినది! నే నీరు బోసినది
పూదీవె పులకించి పూలు బూసినదీ!

## శ్రుతిలయలు గలియగా

శ్రుతిలయలు గలియగా! సుందరంబులు విరియ
నా పాట! నీ పాట నర్తింపనిమ్మా

అణువణువు ప్రకృతిని యందాలు జిందగా
వనదేవతలు జూచి వయ్యారమొలుకగా

శ్రుతిలయలు గలియగా! సుందరంబులు విరియ
నా పాట నీ పాట! నర్తింపనిమ్మా!

నీ మురళి పాటలో నా గొంతు కలవనీ
ఆనంద సుధలలో నటు తేలిపోనిమ్మా!
కలిసిపాడినపాట కలకాల ముండాలి!
జన్మ జన్మల స్మృతిని జాగృతిని గలిగించి!

విడిపోని బంధమై విడిపోని రాగమై
కడదాక నిలిచేటి కమ్మని గీతమై
జన్మజన్మల కోర్కె జాగు సేయక నిమ్మా!
చిరవాంఛితము దీర్చి జేర్చుకొను నీయందు!

మనసు నందున లేచు మధురవాంఛితమేమి
దివియందు భువియందు దీప్తి గలిగించేది
ఒకపాట పాడనీ! వికసింప మానసము
నీ మురళి రాగమున నా గొంతు కలువనీ

శ్రుతిలయలు గలియగా! సుందరంబులు విరియ!
నా పాట! నీ పాట! నర్తింప నిమ్మా

# మురళిపాటను బాడి

మురళి పాటనుబాడి మోదమున ననుముంచి
బందీని జేసితివి! బానిసను జేసి

పాటలో నేముందొ! పరవశము నయిపోదు
నన్ను నేనే మఱతు! నవరాగ సుధలలో

మురళి పాటనుబాడి మోదమున ననుముంచి
బందీని జేసితివి! బానిసను జేసి!

విశ్వమోహనమయిన విమలమగు రాగాలు
మురళితో జతజేసి ప్రయోగించుచుంటివి
గగన తారకలలో కాంతి కిరణాలలో
తేలిపోవుచునుంటి తెలిమబ్బు రేఖగా

నీ పాటతో కలిపి నాపాట బాడగా
శ్రుతిలయలు గలుపగా సుందరంబగు కోర్కె
దరిజేర్చుకొనవు! నీ దాపునకు రానీవు
దూరాన నన్నుంచి దురపిల్ల జేయుదువు

నీ పాటలో గలియ నిండయిన శ్రుతిలయల
నాదమున నాదమయి నటియింప నాకోర్కె
విశ్వమోహనమయిన వేణుగానమునందు
పాటగా పదముగా బల్లవింపగ కోర్కె

మురళి పాటనుబాడి మోదమున ననుముంచి
బందీని జేసితివి! బానిసనుజేసి!

## మనసుతో మీకేమి?

మనసుతో మీకేమి? మాధవునితోనేమి?
విమల నేత్రములార! వేదనలవేలా?

విరహ బాష్పములారా లికి వేదనల బడనేల?
కలతబడగానేల? కారుణ్యమదియేల?

మనసుతో మీకేమి? మాధవునితోనేమి?
విమల నేత్రములార! వేదనలవేలా?

సఖియ మీ కగుగాక! సందియంబదిలేదు
మనసు కోరిన కోర్కె మఱి సాధ్యమా? వినుదు
వన్నె గోపాలునీ వరియించెనట తాను
కోరికను దీర్పగా గోపాలుడెట్లొచ్చు?

మనసు రోదనజెంద మఱి మీరు రోదింప
తగున? యిది సాధ్యమా? తగని కోరికగావ
చెలి వేదనను జూచి జెందకుడు వేదనను
దగదంచు దెలిపి వే తన్వినోదార్పుడో

వచ్చేయు నొకనాడు విమల రూపముతోని
మనసు కోరికదీర్చు మాధవుడు దయతోని
వేచియుండక భక్తి వేదనల జెందుటిది
తగునటవె? యని బలికి తన్వి నోదార్పుడీ

మనసుతో మీకేమి? మాధవునితోనేమి?
విమల నేత్రములార! వేదనలవేలా?

## ఎక్కడో! గనరాక!

ఎక్కడో! గనరాక! నక్కియుండెదవేల?
ముచ్చటగ నా ముందు మురిపాలు జిందూ.

చాటేల? మాటేల? సరసమాడగ నాతో
జన్మ జన్మలనాటి సఖినిగద! గోపాల

ఎక్కడో! గనరాక! నక్కియుండెదవేల?
ముచ్చటగ నాముందు మురిపాలు జిందూ!

దూరాన నుండి నీ తీయంపు మురళినీ
ఖలికింతువేల? నే బరవశము జెందగా
కనిపింపరాద! నాకనులముందర నిలిచి
నీపాటతో గలిపి నే బాడుదునుగదా!

చిఱు గజ్జియలతోని చిందెదవు నాట్యముల
కనుల ముందరగాక కనుల లోపల నిలిచి
రాకూడదా జతగ రమణీయ నర్తనల
ఆడి పాడింతు నిను ఆనంద వాహినిని!

గోప కాంతను నేను! గోవిందుడవు నీవు
ఆనాటి బంధమిది! అలనాటి నెయ్యమును
ఏనాటికిని నేను! నీ దాసినే కదా
ఎచట దాగినగూడ నచటికే జనుదెంతు!

ఎక్కడో! గనరాక! నక్కియుండెదవేల?
ముచ్చటగ నాముందు మురిపాలు జిందూ!

## నా ముందు నిలిచి నను

నా ముందు నిలిచి నను నడిపింపు శ్రీకృష్ణ
ప్రగతి పథములకు నిల ప్రజల సేవకునా

ఉన్నతాదర్శముల యూహలను నింపుకొని
అడుగు ముందుకువేసి యాశయము సాధింప

నా ముందు నిలిచి నను నడిపింపు శ్రీకృష్ణ
ప్రగతి పథములకు నిల ప్రజల సేవకునా!

మధుర భావాలు నా మది సంచరింపగా
మమత సమతా ప్రేమ మాధుర్యమొలుకగా
మంచితనమది నాదు మది పులకరింపగా
దీనులకు దీనునిగ దివ్యత్వమును బొంద!

అజ్ఞాన తిమిరమును నంధత్వమున బాప
వెలుగు దీపముగాగ వేగ నను జేయుమా
పరులకోసము నాదు బ్రతుకునర్పించేటి
త్యాగనిరతిని నాకు దయచేయి మాధవా!

కటిక దారిద్ర్యమును కష్టాల బ్రతుకులను
ధరపిల్లువారలకు దూరమును గాకుండ
కలిసి యుండేటట్లు కారుణ్యమును జూపి
మనిషి బ్రతుకున గలుగు మాధుర్యమును జూపు

నా ముందు నిలిచి నను నడిపింపు శ్రీకృష్ణ
ప్రగతి పథములకు నిల ప్రజల సేవకునా!

## నీ వేణు నాదాలు !

నీ వేణు నాదాలు! నా గీతి శ్రుతిలయలు
అల్లుకోనీ స్వామి! అందాల హొదగా

మల్లెమాలతి లతలు నల్లుకొను రీతిగా
అందాల హరివిల్లు అలరినా రీతిగా

నీ వేణు నాదాలు నా గీతి శ్రుతిలయలు
అల్లుకోనీ స్వామి! అందాల హొదగా!

కోకిలా పాటతో కొసరు చిలుకల పలుకు
కలిసిపోయిన రీతి కలిసిపోనీ స్వామి
గగనాన పయనించు కమనీయ హంసలా
నీ పాట నా పాట నిలిచి ధ్వనియించాలి!

పసుపు సున్నము కలియు పారాణి మాదిరిగ
క్రొత్త ఛందస్సునను క్రొంగొత్త పాటగా
అందాలు విరియాలి! యజరి పూచిన మావి
వనవీధియంతటా వాసనలు విరియాలి!

నా భక్తి గీతమును నీ దయా రసమునూ
కలిసిపోవాలి సుమ! కమనీయ గంధముగ
సంజ కెంపులలోని సరసమగు కాంతులను
దివ్యగంథాలేవా దీప్తి గలిగించినటు

నీ వేణు నాదాలు! నా గీతి భావాలు
అల్లుకోనీ స్వామి! అందాల హొదగా!

# తూర్పు వాకిలిలోన

తూర్పు వాకిలిలోన దోరంపు వేజుక్క
పులకరించినదమ్మ! పుట్టెడు కళలా

రారమ్మ చెలులార! శ్రీ రమణు పూజకై
మధుర గీతాలతో మనసు బొంగారగా

తూర్పు వాకిలిలోన దోరంపు వేజుక్క
పులకరించినదమ్మ! పుట్టెడూ కళలా!

మార్గళి మాసాన మాధవుని బూజింప
సకల సౌభాగ్యములు సంతసంబును గలుగు
కోరికలు బూరించి గోపాల బాలుడూ
సిరి సంపదల నిచ్చు సింగారముల నిచ్చు!

పుణ్య జలకములాడి పురుషోత్తముని దలచి
పసుపు పారాణితో బట్టు వస్త్రములతో
ఇసుక తిన్నెలపైని ఇంపయిన గీతముల
మాధవుని బాడుదము మధురముగ శ్రుతిలయల!

కన్నె పిల్లలమంత కలిసి జేయుదమమ్మ
మాధవుని పూజనూ మల్లెలను మొల్లలను
అందాల మగని మా కందింపుమని వేడి
భక్తితో పూజించి ప్రణతు లర్పింపుదము!

తూర్పు వాకిలిలోన దోరంపు వేజుక్క
పులకరించినదమ్మ! పుట్టెడూ కళలా!

# ఎవరి కగుపింపనీ

ఎవరి కగుపింపనీ యింపొందు నీ రూపు
నా మనసు పొరలలో నాథ! కనిపించి

నా మనసుటద్దమున నాథ! దర్శనమిచ్చి
నా పాట శ్రుతిలయల నాట్యాలు జేసేవు

ఎవరి కగుపింపనీ యింపొందు నీ రూపు
నా మనసు పొరలలో నాథ! కనిపించి!

చిత్రకారుడు వ్రాయు చిత్రమున నిలిచేవు
రంగురంగుల వెలయు రమణీయ మూర్తిగా
శిలలందు నిలిచేవు శిల్పమున శివునిగా
తలలొంచి ప్రజలంత తన్మయము నొందేరు!

బంగారు ప్రతిమలను బాలదాతిని జేరి
వివిధ రూపాలతో వేల యందాలతో
కనిపించెదవుగాని కన్నులకు బందువుగ
నాథ! నాలో నలుపు నటనాలు జూపవుగ!

మధుర పదములను నిను మాటాడజేయుదును
సరస గీతాలతో సయ్యాటలాడింతు
ఎవరు నందగలేని యీ మహాభాగ్యమును
కవిత నారాధించేటి కవిపొందు గదస్వామి

ఎవరి కగుపింపనీ యింపొందు నీ రూపు
నా మనసు పొరలలో నాథ కనిపించి!

# ఆపినా యాగవే!

ఆపినా యాగవే! యా మురళి నాదాలు
ననుముంచు! నను దేల్చు! నవరాగ సుధలా

సెలయేటి జాలుగా జలజలా ప్రవహించి
నా గీతిలో గలియు నవరాగ శ్రుతిలయల

ఆపినా యాగవే! యా మురళి నాదాలు
ననుముంచు! ననుదేల్చు! నవరాగ సుధలా!

మల్లెమాలతి లతలు మావి కొమ్మలుదాటి
పులకరింపులు మాని పొదలందు దాగినా
సంజకెంపులవెంట యందాలు గదిలినటు
నా వెంట నరుదెంచు నందగోపాలుడూ!

మనసులో నుదయించు మధురగీతమునాపి
గొంతులో రాగాల కొసలన్ని విరిచినా
పాడుకొను నా భ్రుకుటి పదనిసల సరిగమల
మౌన విరహిణివోలె మహనీయ శ్రుతిలయల!

రెండు జేతులజేర్చి నిండు మానసముతో
అంజలిని దెలిపినా యందుకొనడింతయిన
అందాల మురళితో నటులబాడుచు నుండు
విరహమున ననుముంచి వేదనల గలిగించు!

ఆపినా యాగవే! యా మురళినాదాలు
ననుముంచు! ననుదేల్చు! నవరాగసుధలా

నేను : కోకిలమ్మా! కోకిలమ్మా
కొండకోనలు ప్రతిధ్వనింపగ
పాడుచుంటివి పరవశింపగ
పరగనేర్చితి వెచ్చటన్?

కోకిల : ప్రకృతి మాతయె నేర్పినది నా
వికృతి దూరము జేసె నంతయు
చిన్నికృష్ణుని బాడుచుంటిని
వన్నెలను నే బొగడుచున్!

నేను : చిలుక తల్లీ! చిలుక తల్లీ
చిన్ని చిన్ని పలుకులను నీ
వెచట నేర్చితి వమ్మ దెలుపుము
వేడుకాయెను నా మదిన్?

చిలుకతల్లి : ప్రకృతి మాతయె నేర్పినదినా
వికృతి దూరము జేసెనంతయు
చిన్ని కృష్ణుని బలుకుచుంటిని
వన్నెలను గీర్తించుచున్!

నేను : కొండకోనల నుండి వెడలి
బండలను బడి దొరలు కొనుచును
సన్ననీ గిరిసోన! గానము
జతను జేసిన దెవ్వరూ?

గిరిసోన : ప్రకృతి మాతయె నేర్పినది నా
వికృతి దూరము జేసిగానము
జతను జేసెను మధుర శ్రుతులను
గతిని దప్పక యుండగన్!

నేను : గగనమందున జిన్నిచుక్కలు
కాంతులొలికే చంద్రరేఖలు
ఎచట నేర్చిరి తెలుపుడమ్మా
యింపుగా నీ శ్రుతిలయల్

చుక్కలు చంద్రరేఖలు :-

ప్రకృతి మాతయె నేర్చినది మా
వికృతి యంతయు దూరమగునటు
అచ్చముగ నా హరిని దలపగ
యలరి నేర్పెను శ్రుతిలయల్

నేను : ప్రకృతి మాతయె పాటబాడుచు
బరగ నేర్పుచు విశ్వమంతయు
పూలు చివురులయందు గూడను
బులకరించును శ్రుతిలయల్!

ప్రకృతిమాతా! నాకు గూడను
బరవశింపగ నేర్పుతల్లీ
అణువుణువున బద్ధమయినా
యా మహోన్నత శ్రుతిలయల్

# కొండ కోనలలోని!

కొండ కోనల నున్న కోకిలమ్మా నీదు
పాటనేర్పి నాదు పతిని జతసేయీ

నీ గొంతు నా కిమ్ము నిలిచి వనవీధిలో
మధురమగు శ్రుతిలయల మాధవుని బాడుదును

కొండ కోనలనున్న కోకిలమ్మా నీదు
పాటనేర్పి నాదు పతిని జతగూర్పా!

విభుని బిలుతును నీదు విమల సుందరగీతి
ఉదయ కుంకుమలలో నుయ్యాల లూగుతూ
పిండారబోసినా పండు వెన్నెలయందు
కదిమినీడను నిలిచి కమ్మగా బాడెదను!

నీ గొంతు నా కిమ్ము! నీ రాజనములిత్తు
పశబఱచు కొందు నా వన్నెలా కృష్ణునీ
వనవీధి యంతటా వగలు జిందగ బాడి
సిగ్గుమొగ్గలువేయ సింగార మొలుకుదును!

మావిజిగురుల దెత్తు! మధువులను గొనిదెత్తు
సురుచిరంబుగ నీదు శుశ్రూషలను జేతు
సెలయేటి తుంపురుల జెలులతో దెప్పింతు
మధురగీతము నేర్పు! మాధుర్యములు జింద

కొండ కోనలనున్న కోకిలమ్మా! నీదు
పాటనేర్పి నాదు బతిని జతగూర్పా!

## విశ్వమంతా నీదు

విశ్వమంతా నీదు విమలమగు రూపములు
నిలిచి యున్నవిగదా నిండారు ప్రేమా

అణువణువునందునా అందాలు నిలిపితివి
నీ ఛాయతే గదా! నిఖిలాత్మ! నిఖిలమును

విశ్వమంతా నీదు విమలమగు రూపములు
నిలిచి యున్నవిగదా నిండారు ప్రేమా!

పూవులను నిలిపితివి పుష్పొదుల తావులను
మనిషిలో నిలిపితివి మానవత్వము, ప్రేమ
నీలి గగనమునందు నిలిపితివి తారలను
ప్రేమామృతముతోని ప్రీతి గూర్చితివంత!

పుడమి యణువణువునూ పులకరించును గరుణ
కలువ తామరలతో కమ్మనీ సరసులను
వెన్నెలల గూర్చితిని విమల సౌందర్యముల
సంజలను నిలిపితిని స్వర్గీయ కుంకుమల

సకల వస్తువులనూ సౌందర్యమును నిలిపి
నిత్య నూత్నముల్లైన సత్యముల వెలయించి
నిఖిల జీవుల ప్రేమ నిండు దయతో బిలుచు
ప్రేమార్ద్ర భావముల ప్రీతి జూచుచునుంటి

విశ్వమంతా నీదు విమలమగు రూపములు
నిలిచి యున్నవిగదా నిండారు ప్రేమా!

## అణువణువు నందునా

అణువణువు నందునా! యన్ని రూపములతో
నిండినా పరమాత్మా! నిన్నెటుల గాంతూ?

ఎచట వెదుకుదును ని న్నేమి గోరుదు ప్రభూ
నాలోని యణువణువు నాట్యమాడే స్వామి

అణువణువునందునా యన్ని రూపములతో
నిండినా పరమాత్మా! ని న్నెటుల గాంతూ?

నే నెచట నుంటినో! నా రూపమేమియో
అణువుగా నేనిచట నలరి యుంటిని స్వామి
తమ్మనీ నీ విమల గానమున మునుగుచూ
తెలిమబ్బు రేఖగా దేలుచుంటిని స్వామి!

అంజలిని ఘటియించి యాత్మార్పణంబనుచు
సర్వమర్పించితిని సరసగీతముతోని
మధుర గోపిక ననుచు మాధవా! నిను దలచి
పాటపాడుచునుంటి పారవశ్యము జెంద!

మనసునందున నిలిచి మాధవా కరుణించి
బంధుత్వమును గలిపి బాంధవుడ వగుమోయి
జన్మజన్మల భక్తి జాలుగా బ్రవహింప
భవబంధములనుండి బయలు బడవేయుమా

అణువణువునందునా! యన్ని రూపములతో
నిండినా పరమాత్మా! నిన్నెటుల గాంతూ!

# ఇతర గ్రంథములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారి
యనుమతిని పొందబడినవి.

పుస్తకముల కన్నింటికి సైషేషను నంబర్లుగలవు

| | | | |
|---|---|---|---|
| 1. | నాలో వెలిగే దీపాలు | (బాలసాహిత్యం) | 0-50 |
| 2. | విజయ మంగళం | (గీతములు) | 4-00 |
| 3. | అందరికీ నచ్చిన కోడలు | (నాటిక) | 2-00 |
| 4. | ఉత్తర గో గ్రహణము | (నాటిక) | 2-00 |
| 5. | శ్రీ కందుకూరి, శ్రీ సరోజినీదేవి | (బుర్రకథలు) | 2-00 |
| 6. | ఆనంద మంగళం | (లలిత గీతాలు) | 4-00 |
| 7. | నాట్యశాల | (నాటిక) | 4-00 |
| 8. | గోపబాలక శతకము | (పద్యములు) | 1-50 |
| 9. | భూమితల్లి బిడ్డలు | (నాటిక) | 2-50 |
| 10. | పాలేటి తరగల్లో మల్లి | (పాటలు) | 5-00 |
| 11. | వీధి దీపం | (కవితలు) | 4-00 |
| 12. | వినయాంజలి | (భక్తి వచనములు) | 4-00 |
| 13. | శ్రీరామచంద్ర సుధ | (పాటలు) | 4-00 |
| 14. | ఝాన్సీరాణి | (బుర్రకథ) | 2-50 |
| 15. | కృష్ణదాసి | (లలితగీతాలు) | 4-00 |
| 16. | చిగురులు-పువ్వులు | (లలితగీతాలు) | 4-00 |
| 17. | పాలేటి తరగల్లో మల్లి | (పాటలు) | 5-00 |
| 18. | శోణ పద్మం | (నాటిక) | 3-00 |
| 19. | హరిదాసు | (పాటలు) | 2-00 |
| 20. | పూలరథం | (గేయములు) | 4-00 |
| 21. | శ్రీ అల్లూరి | (బుర్రకథ) | 3-00 |